# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 — రాజమహేంద్రవరము 16-8 1980 — సంచిక 20


—* ఈ సంచికలో *—





1—9—1980 సంచికలో శారదాధ్వజా. వంశాంతరంలో పుత్త్రిప్రాశస్త్యం, ప్రేమవిచికిత్స, ఆంధ్రమున అష్టాదశ వర్ణనల నిర్ణయం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా :

సంవత్సరమునకు రు. 10—00.

అర్ధసంవత్సరమునకు రు. 5—50.

విడిప్రతి 50 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము ౩ | రాజమహేంద్రవరము 16-8-1980 | సంచిక 20


## జంటకవుల 'ప్రబోధచంద్రోదయము' - ఒక సమీక్ష


— శ్రీ కందనెల్లి భద్రన్న, ఎం. ఏ.


ఆంధ్ర సాహిత్యమునందు జంటకవులైన నంది మల్లయ, ఘంట సింగయలకు ఒక ప్రత్యేక స్థానముకలదు. ప్రబోధ చంద్రోదయము, వరాహ పురాణము, కవుల షష్ఠము, అనునవి వీరి రచనలు. సంస్కృతమున కృష్ణమిశ్రకవి రచించిన ప్రబోధ చంద్రోదయ నాటకమునకు వీరి ప్రబోధ చంద్రోదయము ప్రబంధ పద్ధతిలో సాగిన అనువాద రూపకల్పన. దీని రచనా కాలము క్రీ.శ. 1460 ప్రాంతమని విమర్శకుల అభిప్రాయము. ఈకావ్యమును అనంతా మాత్యుని గంగయ మంత్రికి అంకిత మొనర్చిరి. ఈకావ్య వైశిష్ట్యమును జంటకవు లిట్లు అవతారికలో పేర్కొన్నారు.

వివరింప నిది సర్వవేదాంత సారంబు
తలపగా నిది గట్టి తెలివిత్రోవ-
యిది భోగమోక్ష సంపదలకు మూలంబు
మోస లేదిది ఘనంబులకు ఘనము
గాన కర్మ రహస్య సాధనంబును నిది
యిది నవరసముల నీను సురభి
షడ్దర్శనంబులు పరవి నిండున్నవి
సందేహములఁ దీఱ విండు గాని
యిమ్మహారసపాకము నెఱిగినట్టి
జను డెఱుంగడు మఱి తల్లి చన్నుపాలు
దీని సరిచెప్ప మఱిలేవు త్రిభువనముల
దొరక దీకృతి నీవంటి దొరకు గాని.

పై వివరణను బట్టి ప్రబోధ చంద్రోదయము ఆధ్యాత్మిక విషయ పూర్ణమై, అద్వైత వేదాంత తత్త్వ జ్ఞానోపదేశకమైన గ్రంథ మని స్పష్టమగుచున్నది. ఈ కావ్యమందు మధ్యలో ద్వైతము, పాశుపతము, కాపాలికము మొదలగు ఆస్తిక మతములే కాక, బౌద్ధ జైనాది నాస్తిక మతములును ప్రసక్తములై సరియైనవి గావని ఖండింప బడినవి.

అద్వైత ప్రతిపాదితగ్రంథముప్రబోధ చంద్రోదయముగాన నిట అద్వైత తత్త్వమును కొంత క్లుప్తముగా వివరింతును. బ్రహ్మసత్యము, జగత్తు మిథ్య మాయా ప్రపంచ మంతయు బ్రహ్మ కల్పితము. బ్రహ్మము సమస్తమునకు కారణభూతమై సర్వము నిండియున్నది. బ్రహ్మము మాయతో కలసి పరమ పురుషుడగును. ఆ పరమ పురుషునియందే మాయ సత్వగుణమును కలిగి యుండి అవిద్య యన బడుచున్నది. జీవుడు అవిద్యను కలిగియున్నంత వరకు బ్రహ్మపదార్థమునకును, దృశ్యమానమైన మాయా ప్రపంచమునకును తాను భిన్న మని భావించును. జ్ఞానావిర్భావము జరిగినపుడే అవిద్య నశించును. అట్టి అవిద్య నశించినచో జీవుడు బ్రహ్మైక్యమును పొందును. ఇదియే మోక్షము.

సంక్షిప్త ఇతివృత్తము :

ఈశ్వరుడు మాయ యను పట్టమహిషి వలన మనస్సనెడు తనయుని పొందును. ఆ మనస్సునకు ప్రవృత్తి, నివృత్తి యని యిర్వురు భార్యలు ప్రవృత్తివలన మోహాదిసుతులు, నివృత్తి వలన వివేకాదిసుతులు జన్మించెదరు మోహాదులు వివేకాదులు దాయాదులైనారు. ఈ యిరుపక్షముల వారికి తగవులు కల్గుచుండెను. తండ్రి పక్షపాత కారణమున మోహుడు రాజ్యమును వశము చేసికొనగా వివేకుడు కొంత కాలము వైదొలగి విద్యా ప్రబోధచంద్రోదయానంతరము మోహాదులను జయించి జీవేశ్వరునకు మంత్రియై సదానంద సామ్రాజ్యమును పాలించెను.

విశిష్ట పద్యముల వివరణ

మహా మోహ మహారాజునకు కాముడు తన సుమ బాణముల ప్రతిభను తెలుపునపుడు

నావిలు, నమ్ములుఁ, జూడఁగ
బూవులవలె నుండుఁగాని భువనములందా
జ్ఞానవశులు గాక తక్కిన
దేవాసుర వరుల నైన ధృతి దూలింతున్'

అనును. నిజమేమరి ఇంద్ర, చంద్రాదులను సైతము ధృతి [illegible], ఘట్టముల నెన్నింటినో మన కావ్యములందు పరికింప వచ్చును.



ఈ పద్యమునందలి మూడు చరణాలలో సకల భూతములు తనయందును తనను అన్ని భూతములయందును జూచు సమైక్య దృష్టి గల వారికి పరమాత్మ దర్శనము కలుగుననే భావమున్న 'సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని' అను గీతా శ్లోకము స్ఫురణ. ఇంక అట్టి వారికి శోక మోహము లేలయుండును ?

ఇంక వ్యాస సరస్వతి దుఃఖకారణము తెల్పుచున్నది.

పెంచినట్టి కోడి బిల్లి భక్షించిన
జెందు వగపు పిచ్చుక కందు గలదె?

పెంచుకున్న మోహమే దుఃఖ కారణమని స్పష్టమగుచున్నది.

ఇక తత్త్వమసి వాక్యార్థమును పురుషునకు విశదము బోధించు సందర్భమున నొక పద్యము.

ఇది నేను గా నిది నేను గా
నిది నేను గా ననుచు నిశ్చయించుచు రాని
ద్వది యైన నడచి యెయ్యది
తుదిదోచెడి నదియె నీవు ధ్రువమని
పలికెన్.

పంచ భూతముల పంచీకరణముచే నేర్పడిన యుపాధిత్రయము అతీతములను దాటిన ఆత్మ సాక్షాత్కారము అగును. అదియే మోక్షమని సంకేతార్థము.

ఈ విధముగా ప్రబోధచంద్రోదయమునందు వేదాంత సూక్తి గుంభములు, హితోక్తులు, వేదాంత రసగుళికలు పాఠకులకు లభించు నని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఆంధ్ర సాహిత్యములో నింతటి మహోత్కృష్టమైన ఆధ్యాత్మిక గ్రంథము మనకు నొసంగిన జంటకవులకు సాహితీ లోకము ఎన్నటికిని కృతజ్ఞతా భావమును కలిగియుండును.

—.0.—

# ఆముక్తము - ఋతువర్ణన సౌందర్యము

- శ్రీ

ఆంధ్రభోజుడు సాహితీ సమరాంగణ సార్వభౌముడు సకల విద్యా పారంగతుడు అయిన శ్రీ కృష్ణదేవరాయలు విద్యానగర సామ్రాజ్యముతో పాటుగా విశ్వకవితా సామ్రాజ్యమును గూడ నేలుచు స్వీయ మేధా సంపాదిత ప్రతిభాత సామర్థ్యముతో విష్ణుచిత్తీయము నను నామాంతరము గల్గిన ఆముక్తమాల్యదా ప్రబంధమును వర్ణభవ్యకల్పనా పరిపూర్ణముగను నవరసభరితముగను మహాకావ్యలక్షణలక్షితముగను రచించి ఆంధ్రభారతికి ఒక చక్కని కావ్య సుమము నందించి రాజకవియై కవితా ప్రావీణ్య ఘనీకుడై ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున నల్దిక్కుల యశో వైజయంతికల నెగురవేసినాడు.

ఏ తద్గ్రంథ కర్తృత్వ విషయమున వాదోపవాదము లున్నమాట నిజమే అయిననూ ఇందలి ఋతు వర్ణనములు పరిశీలింపగా ఇతర కవులయందు గానరాని ఏదియో ఒక ప్రత్యేకత గోచరించు నని చెప్పక తప్పదు. ఇందలి ఋతువర్ణనా వైచిత్రిని తడవి చూచినంతనే పెద్దన మనుచరిత్రములోని ఋతు వర్ణనములకు వీటికిని హస్తిమశకాంతరము దృగ్గోచరమై రాయల ప్రత్యేకత ఇందు కొట్టవచ్చినట్లుగా కనబడుచునే యుండు ననక తప్పదు కేవలము ఋతువర్ణనము లందే కాక ఇతర వర్ణములందునూ ఈ ప్రత్యేకత గోచరించు చుండును.

అష్టాదశ వర్ణనలలో మకుటాయమానమైనది ఋతువర్ణనము. నన్నయ కాలము నాంటి నేటివరకు ప్రతియుగమునందును ఈ ఋతువర్ణనము కావ్యముల యందు విడిపోక వచ్చుచునే యున్నను, నిజముగ వర్ణనములకు నుండదగు ప్రబంధ యుగమని ప్రసిద్ధి. రాయల ఆముక్తమాల్యదా కావ్యములోని వర్ణనములలో మకుటాయమానమైనది ఋతువర్ణనమే!

సాధారణముగా కవులు ఋతువర్ణనములను గావించు సమయమున ఆయా ఋతువులకు తగినట్లుగా ఆ సమయమునందు వృక్షములను, జంతువులను, పక్షులను వర్ణింతురు. మరికొన్ని యాధారముల ద్వారా ఆయా వర్ణనములను సాగించుచుందురు. అట్టి వర్ణనల విషయమున నీరాజకవియందొక ప్రత్యేకత గోచరించును. కావ్యమునకు అప్రకృతమైననూ వివిధ పురాణగాథలు వర్ణనములందు ఇనుమడింపజేసి రచనము గావించుచుండును. ఒక్కొక్కతరి ప్రత్యేకముగా ఒక సన్నివేశమును కల్పించి ఒక్క చిన్న కందపద్యమునందే ఒక చిట్టి కథగా ఉత్ప్రేక్షాద్యలంకారములతో నలంకరించి వర్ణనము సాగించుచుండును. పద్యము చదివినంతనే అందలి సన్నివేశకల్పనము పాఠకజనులకు సూత్రప్రాయముగా మనంబున తట్టునట్లుగ నలరించి మిగిలిన కథాభాగము వారి యూహకు వదలివేయుచుండును. ఇట్టి రచనా విశేషములతో నలరారిన ఈ రాచకవి ఋతువర్ణనా సౌందర్యమును ఇంచుకంత పరిశీలింతము.

ఆముక్తమాల్యదా కావ్యము నందు ఋతువర్ణన గ్రీష్మముతో నారంభమైనది. పాండ్యదేశపు రాజైన మత్స్యధ్వజుడు సామ్రాజ్యవైభవము ననుభవించు సమయమున గ్రీష్మము శాల్మలీఫల విదళనంబుతో ప్రారంభమైనదట. ఈ వర్ణనము రాయలు సుమారు ఇరువదియారు పద్యములలో నడిపించినాడు. సాధారణముగా గ్రీష్మమునందు అహస్సు వృద్ధి యగుచుండును. దానికి కారణము జెప్పుచూ కల్పించి ఈ సన్నివేశమును ఇంచుకంత పరిశీలింతము.

ఓడమగ వెట్ల నర[illegible]
ప్రాచీన మహా[illegible]

బడలిక నుండు నచ్చిలువ
  పగ్గములన్ రవియాజ్ఞ మాటికి
న్మడియిడఁ బిమ్మగుంటు రథ
  మున్నిలుప న్బయనంబు సాగమిన్
జడను వహించె నాఁగ దివ
  సంబులు దీర్ఘము లయ్యె నత్తరిన్.
(ఆ.2. 49)

ఉడుపప్రాశన మొల్లక కూటికి నొచ్చినవియై ముడులు విడిపోవుచుండ నర్కుని యాజ్ఞ చొప్పున అనూరుఁడు రథము నిలుపుచు నా ముడులను బిగించుట వలన కల్గిన ప్రయాణ జడత్వము వలన అహస్సు వృద్ధి బొందె నట. ఎంతటి అద్భుత కల్పనము?

సాధారణముగా నిండ్లలో దోసెలు పోసెడు విధమును ఋతు వర్ణనమున నిమిడ్చిన తీరు గనుఁడు.

ఎసఁగు కట్టావిక్రియ నావిరెగయఁ బ్రంటి
యొండ యుడు కారపుం భూ
  మండలమునఁ
బొలిచె మాపటఁ బండు వెన్నెల చకోర
పోత పితితికిఁ జాఁపట్టు వోసినట్లు
(ఆ.౨.60)

పెనముపై పిండి వోయగా నెగసిన ఆవిరివలె నావిరి యెగయుచుండఁ గాలిన పెనమువలెనున్న భూమండలమున వెన్నెల చకోర-పిల్లలకు పలుచని దోసెలు పోసిన ట్లుండెనట! ఎంత చక్కని కల్పనము! ఇట్టి కల్పనము లింకెన్నియో గోచరించును.

గ్రీష్మము తరువాత నాల్గవ యాశ్వాసమున యామునాచార్యుఁడు దిగ్విజయము గావించె నన్న మతమును ఖండించి, ఆ సమయమున వరుసగా వర్ష శరదృతువు లారంభమైనవి. ఈ వర్ష ఋతు సమయమున సూర్యుఁడు కర్కాటక ప్రవేశము చేయుట నా కవి అపూర్వ కల్పనముతో చక్కగా చమత్కరించినాఁడు. సాధారణముగా సత్తవారింటఁ గాపురముఁ జేయు కుమార్తెలకు గర్భము గలుగ పుట్టినింటికి వచ్చెడు సన్నివేశమును ఎట్లు చమత్కరించెనో చూడుడు.

వనధి గమనజగర్భార్క జనిత ఘృణులు
మరి ప్రసూతికి వతని ధామంబు జేర
ఘనతఁ జొచ్చిన యిండ్లను తనయ లుండి
కాన్పునకుఁ బుట్టిని ల్చేరుక్రమముగనియె
(ఆ.౪.78)

సూర్యకిరణములు మేఘములు గదా! కాన సూర్యునివలన బుట్టినవి. అవి సముద్రమునిఁ బొందుటచే ఉదరము లను గర్భములఁ దాల్చి జన్మస్థానమైన సూర్యునిఁ జేరుచున్నవన్నట్లు వర్షించుచున్న వట! వర్షర్తువు నందుండెడి ఆరుద్ర పుర్వులను కవి యుత్ప్రేక్షించెడు తీరు గనుడు!

గగన రంగస్థలమ్మున మిఘలఁ బ్రౌఢి
మమునఁ గాళికనిల్చి కోలము నటింప
బొరి వింగంబున రాలం నిప్పుకలనంగ
గుంపులై రాలె మహి నింద్ర గోపతతులు
(ఆ. 4.98)

ఆకాశ మొక నాట్యభూమి యట! మబ్బులగుంపు కాళికాశక్తి యట! ఆమె మోమునుండి రాలు నిప్పుకలే ఆరుద్ర పురువు లట!

ఇట్టి సన్నివేశకల్పనములతో సుమారు అరువది పద్యములతో సాగించి శరత్తునం దడుగిడినాఁడు. ఈ శరత్తు ప్రవేశము కాగానే యాకాశము నలుపెక్కును గదా! అదిహరిమణిజంబూఫలానీత తామర రుచులతో నొప్పుచుండె నట! శరదృతువునందు జలములు కలక తేలును గదా! జలదేవతలు కెరటము లను హస్తములతో సోపానములపై అగస్త్యుఁ డను నిండుప గింజ నరుగ దీయగా నీరు స్వచ్ఛమయ్యె నట! అట్లే చెరువులందలి పద్మముల పత్రములపై చేరిన జలబిందువులు అగస్త్యుఁడు సముద్రము నాపోశించినప్పుడు కడుపు లోనికి బోయిన ముత్యములు వెలికి గ్రక్కె నా యన్నట్లొప్పారె నట!

ఈ వర్ణనమును సుమారు నలువది యారు పద్యములతో నడిపించినాఁడు. ఇక చివరిది వసంతము. ఇదికూడా అరువది రెండు పద్యములతో వర్ణితమైనది. గోదాదేవి విరహతాపము నోరువ జాలకయున్న దట! దక్షిణదిక్కు, సూర్యుఁడు తానును వేడిచేసిన యాదిక్కు మాడిపోవు నని తలంచి సూర్యుఁడు ఉత్తరాయణ ప్రవేశమయ్యె నట! ఎంతటి చక్కని చమత్కారము! కథలో కలసిపోయెడు రీతిని ఋతువు నారభించుట కూడ ఒక విశేషము. ఈ వసంతమున కింశుక కోరకంబులు విరహులకు వ్యథ చేసిన రీతి గనుడు.

అవని నపుడు నవోదితుండైన యట్టి
మరునకుం గుసుమర్తువ న్మంత్రసాని
బొడ్డుగోసిన కొడవలిబోలె విరహి
దాంకంబయ్యెఁ గింశుక కోరకంబు.
(ఆ ౪.112)

మోదుగలు పుష్పింపగా ఆ మొగ్గలంకరగా నెర్రగా నుండుటవలన నప్పుడే యుదయించిన మన్మథుని బొడ్డుకోసిన నెత్తురు గూడియున్న లిక్కి కొడవలివలె విరహులకు బాధఁ గల్గించుచున్న దట! ఎంతటి చక్కని ఉత్ప్రేక్షయో గదా! భూమి యనెడు ఆడు ఏనుగుపై కప్పిన బూనీసువలె వసంతమున చిగురాకులు దొడిగినవట! ఇఁక చివరకా ద్విరేఫముల ద్విజత్వమును కోకిలల పంచమత్వమును చమత్కరించిన తీరును పరిశీలింపుడు!

ద్విజతఁ గాంచియు మధుసేవ విడువలేక
జాతిఁ బాసిన తేంట్ల నిస్వనముఁగూడు
కొనుటనో యనఁ గోకిల స్వనము సెలఁగ
దనపుమతి పంచమత్వంబు తప్పకుండ
(ఆ.౫.119)

ఈ విధముగా తన ఆముక్తమాల్యదా కావ్యమున ఋతు వర్ణనములను గావించి ఇతర వర్ణనల విషయమునను మిక్కిలి శ్రద్ధతో వివిధకల్పనాచమత్కృతులతో కావ్యేందిరను సర్వాలంకార భూషితగా నలంకరించినాడు మన రాజకవి. ఆంధ్ర జలజాక్షుఁ డనినట్లుగా ఈతనికి ఆంధ్ర భాష యసాధ్యంబు గాదని క్రియా రూపమున నిరూపించిన కావ్యాలంకార మర్మజ్ఞుఁడు మన కృష్ణదేవరాయ కవి సార్వభౌముఁడు___

...0...

# వాస్తవ కథనము

## రాజమండ్రి వేదశాస్త్ర పరిషత్తువారికి సమాధానము.

**విషయం : జ్యోతిష మహాసభా తీర్మానములు.**

16-6-1980 రాజమహేంద్రవరం సమాలోచన పత్రికలో పీసపాటి సూర్యప్రకాశంగారు 'రాజమండ్రి జ్యోతిశ్శాస్త్ర సభానిర్వాహకులైన వేదశాస్త్ర పరిషత్తువారి అభిప్రాయములను వివరింపవలసిన ఆవశ్యకత ఏర్పడినది' అని వ్రాయుటచే మేము వేదశాస్త్ర పరిషత్తు వారికే ఈ సమాధానమంతయూ నిచ్చుచున్నామని సవినయముగ మనవి చేయుచున్నాము.

(1) వేదశాస్త్ర పరిషత్తువారు 'కారణాంతరములచే రాలేకపోయినను కనీసము తమ అభిప్రాయములను లిఖితరూపముగానైనను పంపియుండలేదు. అట్లు వచ్చుటగాని, పంపుటగాని జరిగినచో వారి అభిప్రాయములను కూడ సమగ్రముగా చర్చించుటకు వీలయ్యేడిది' అని మాయందు దోషారోపణ చేసినారు.

పరిషత్తు కోశాధికారు లగు శ్రీ పీసపాటి సూర్యప్రకాశంగారు మొదట పంపిన ఆహ్వానము డిశంబరు 31 ని అందినది. అందు జ్యోతిశ్శాస్త్ర సభలు 1980 జనవరి 20-21-22-23 తారీఖులలో జరుగునని తెలిపినారు.

తరువాత పైవారు పంపిన రెండవ ఆహ్వానము 1980 జనవరి 15మంగళవారమందినది. అందు 1980 జనవరి 20-21-22 మూడురోజులు జ్యోతిశ్శాస్త్రసభలు జరుగునని తెలిపినారు.

తరువాత 16-1-1980 తారీఖున పై శ్రీ పీ. పాటి సూర్యప్రకాశంగారు సంతకము చేసి 'ఇందుతో విషయముల పట్టిక పంపుచున్నాను. ఈపట్టిక మీకు విషయములు ముందుగా చూచుటకు సహాయపడును' అని వ్రాసిన లేఖ 18-1 1980 సాయంకాలమునకు చేరినది 19 తారీఖున బయలుదేరు సమయమున విశాఖపట్నం నుండి పిడపర్తి లక్ష్మీనరసింహశాస్త్రి సిద్ధాంతిగారు స్వర్గస్థులైనట్లు ఉత్తరము వచ్చుటచే వేదాంగమగు జ్యోతిశ్శాస్త్ర చర్చలో పాల్గొనకూడ దను ధర్మభీతితో పై కారణమును తెలుపుచూ సభకు రాజాల మని 19 సాయంకాలం శ్రీ పీసపాటి సూర్యప్రకాశంగారి అడ్రస్సుకు టెలిగ్రాం ఇచ్చినాము.

పై పరిషత్తువారు మొదటి ఆహ్వానములో అనగా31-12-79 తారీఖునవచ్చిన ఉత్తరములో ఈ చర్చనీయ విషయముల పట్టికను పంపినగాని లిఖిత రూపముగు సమాధానము వ్రాయుట శక్యము కానేరదు. శాస్త్రీయ విషయములను గూర్చి ఇంత అవ్యవధిలో అనగా రెండు రోజులలో అభిప్రాయమును పంపుటకు వీలుకాదని పై పరిషత్సభ్యు లందరకు విదితమైన విషయమే. ఈ చర్చనీయ విషయముల పట్టికను ఏకారణంచేత మొదట మాకు పంపలేదో సహృదయులగు పరిషత్తువారికి తెలిసినయెడల మాయందు ఇట్టి నేరారోపణ కవకాశముండ దనియే మనవి చేయుచున్నాము.

(2) 'ఎక్కువగా అభిప్రాయ భేదములు అయనాంశ విషయ నిర్ణయమునందే కన్పట్టుచున్నవి. దీనిపై పెక్కు వాదోపవాదములున్నవి.పండితులందరకు ఆమోదయోగ్యమైన ప్రమాణ నిర్ణయ మింతవరకు జరుగక పోవుటచేత నీ పునఃపునః పరిశీలనావశ్యకత ఏర్పడుచున్నది' అని తాము సభను నిర్వహించుటకు గల కారణమును పరిషత్తువారు ఉటంకించినారు.

న్యాయదృష్టితో చూచిన అయనాంశ విషయము వివాదగ్రస్తమైనది కాదు. కారణమేమన నిబంధనకర్తలు, శతాబ్దములనుండి ఉద్దండులగు మహాపండితులు, ఇటీవలికాలములో కమిటీవారి రిపోర్టుకు పూర్వమే యావద్భారతమునందు గల అత్యధిక పండితులు, గ్రహించిన తీరు చూచిన అయనాంశలకొరకే సభ చేయించుటలో అధికవ్యయము, వ్యర్థప్రయాస తప్ప ప్రయోజనం కనుపడని మాట వాస్తవ మని స్పష్టమైనది.మరియు రిపోర్టు వారు 8 సంవత్సరములు విమర్శచేసి బహుపండితామోదములనుపొందిన అయనాంశలను 2,3 రోజుల ఈ అవ్యవధి కాలములో కాదని మరియొక రకముగ తేల్చగలమనుకొనడంలో దూరదృష్టిలో చూచిన పరిషత్తు వారు కొంచెముతొందరపడి రేమో యనిపించుచున్నది.

(3) 'పంచాంగ రచనలో వైరుధ్యం అంటూ ఏమీ లేదని, రిఫారం కమిటీవారి సిఫార్సులను ఏనాడో ఆమోదించటం జరిగినదనీ వ్యాసకర్తలు సోపపత్తికంగా తమ వాదమును ప్రతిపాదించారు' అని తమనుగూర్చి తామే ఎవరో వ్రాస్తున్నట్లు వ్యాసకర్తలు వ్రాసికొన్నారు' అని పరిషత్తువారు మమ్ములను అధిక్షేపించినారు.

ఆంధ్రప్రభవారిని ఈ విషయమును మేము వ్రాసినామో, లేక ప్రభవారే తమ అభిప్రాయముగ వ్రాసినారో అడిగి తెలుసుకోకుండగ ఇట్లు అన్యాయముగ మేమే వ్రాసుకొన్నామని అధిక్షేపించుట ఉదారులగు, భావజ్ఞులగు, పై పరిషత్సభ్యులందరకు ఎంతయు తగని పని యని మనవి చేయుచున్నాము.

(4) 'ఇంతకూ వీరుఅన్న ఉపపత్తులు గత రౌద్ర సంవత్సర పుష్కరసభ(అప్పటికి బహుశః వీరు పుట్టి ఉండకపోవచ్చును.) 1934 మైసూరు సభ, 1935

పుష్కరాధిక మాస నిర్ణయసభ, 1968 ఢిల్లీసభ- ఇట్టి సభలయందలి తీర్మానముల పేర్కొనుటయే. ఏప్రమాణముల ఆధారముగా ఆయాసభలలో ఆయానిర్ణయములు జరిగినదీ వివరింపలేదు. ఈవిధంగా వీరుద్దేశించిన సందేహ నివృత్తి అత్యం ఎంత మాత్రం నెఱవేరలే దనుట సత్యదూరం కాదు' అని విపరీతముగ పైపరిషత్తువారు గ్రహించిరి.

మా జననమునకు పూర్వమునుండి చైత్ర పక్షాయనాంశలు ఆయా యీసభలయందు నిర్ణయించినట్లు, పై పరిషత్తు వారును అంగీకరించినట్లు, మేము అసత్యమును ప్రకటించనట్లు, వారేస్పష్టపరచుచుండిరి. (ఈ విషయమునే ముందుముందు ఆక్షేపణముల దృఢపరచుచూ) ఆ తీర్మానములను ఏ ప్రమాణముల చేసినారో యని పై పరిషత్తువారికి సందేహము కలిగిన తాము వాట్లను స్వయముగ చూచి అందలి మంచి చెడ్డలను గ్రహించవలసిన విధి పరిషత్తు వారియం దుండగ ఆప్రమాణముల మేము మా వ్యాసములో చూపక పోవుటయే వారికి సందేహ నివృత్తి కాకపోవుటకు సాకుగ చెప్పుచున్నారు. గ్రంథకర్తలకు గాని, వ్యాసకర్తలకుగాని, ఒకనిర్ణయము చేయునపుడు సహాయభూతమగు తత్తన్నిర్ణయములను గ్రహించడమే గాని; ఆ మూలాగ్రముగ తత్తద్విమర్శలను వ్రాయడము ప్రాచీన కాలమునుండియు సంప్రదాయసిద్ధమై లేదు. ఏవ్యాసకర్తలయినా తత్తన్నిర్ణయములను అన్యథాగా వ్రాసినచో అది క్షమార్హమైన తప్పుగాదు. ఆయా సభల నిర్ణయమును మే మన్యథాగా వ్రాయుచో అది మాతప్పు- మేమువ్రాసిన ఆయా సభల నిర్ణయములు పై పరిషత్తు వారు సత్యమని అంగీకరించుటచే తద్వృత్తాంతములు తెప్పించుకొని సందేహ నివృత్తి చేసుకొనవలసినదిగ కోరుచున్నాము.

(5) 'అయనాంశముల గురించి స్థిర నిర్ణయము జరుగ లేదనుటకు వారు వ్రాసినట్లు మరల మరల సభలు జరుగుటయే తార్కాణము. ఒకవేళ నిర్ణయము జరిగియే యున్నచో అందలి సామంజస్యమును నేడు భిన్న భిన్న అయనాంశలను స్వీకరించేవారికి సప్రమాణముగ వివరించి వారిచే ఆమోదింపజేయవలసిన బాధ్యత ఈ ప్రసిద్ధ జ్యోతిషపండితులపై నున్నది. ఇట్టి సమన్వయ పద్ధతికై సభల ఏర్పాటు ఎంతయు అవసరము' అనునది పరిషత్తు వారు తమ సభావకాశమును కల్పించుకొనుటకు వ్రాసినదని స్పష్టమగుచున్నది.

ఎన్నియో సభలయందు ఏకగ్రీవ నిర్ణయము జరిగిన దని, భారతదేశమునందు అత్యధిక పండితామోదమును పొందినదని నిర్ణయ పురస్సరముగ ఆ సభలు నిరూపించగ ఇట్లపార్థము కల్పించుట పరిషత్తు వారికి తగిన సమన్వయ పద్ధతిగాదు. గత వంద సంవత్సరములనుండి ఎన్ని తీర్మానములు జరిగినను వాట్లను సరకుచేయక తమ దారినే తాము నడచుచున్న పరిస్థితిలో బాధ్యత మాయందు కల దని పరిషత్తు వారు వ్రాయుట తత్త్వస్వభావములను గమనించక వ్రాసినది గాని అన్యము కాదు.

(6) పరిషత్తువారు 'ప్రభుత్వ శాసన ముద్వారా అవి సాధించవలె' ననుకొనుట వారి వాదమునకు పుష్టిని చేకూర్చదు'అని వ్రాసినారు.

అందరిని ఒకే మార్గమున నడిపించవలయునన్న సత్యమునకు అంతికంటె మార్గము లేదు. కాబట్టిన సందేటికి మూఢేశ ళ్లు అనువారికి, న్యాయాన్యాయ విమర్శ లేనివారికి, శాసన ప్రయోగం తప్ప మరియొక గతిలే దని దృఢముగా చెప్పుచున్నాము. అట్టివారికి సభలతో ప్రయోజనము వ్యర్థమని పరిషత్తు వారికి మనవి చేయుచున్నాము.

(7) పరిషత్తు వారు 'సిద్ధాంతముల కంటెను- ప్రమాణముల కంటెను శ్రీ మధుర కృష్ణమూర్తి సిద్ధాంతిగారి పేరు, శ్రీపాద వెంకటరమణ సిద్ధాంతిగారి పేరు ధూళిపాళ అర్కసోమయాజులుగారి పేరు ప్రస్తావించిన తీరుచూడగా వీరికా పండితులపైగల వ్యక్తిగత రాగద్వేషాదికము అధికముగా గోచరమగుచున్నది'అని మరియొక దోషారోపణ మాయందు చేసియున్నారు.

వారు మైసూరు మొదలగు సభలలో నుండగ వారి ఎదుటనే వారికి వ్యతిరేక తీర్మానములు అయినవని చెప్పుటకు వారి నామధేయములు పేర్కొనవలసివచ్చినది గాని వారియందు మాకెట్టి వ్యక్తిగత రాగద్వేషములులే వని శాస్త్రీయ ప్రసంగములయందే అదరాభిమానములు కలవని పరిషత్తు వారికి మనవి చేయుచున్నాము.

(8) 'చైత్ర పక్షాయనాంశలే స్వీకార్యములని 22 అయనాంశలు స్వీకరించిన పద్ధతియే శ్రేష్ఠమైన దనీ ఏనాడో నిర్ణయింపబడియుండగా తాముఒకటి, రెండు సంవత్సరముల పూర్వమువరకు రెండుపద్ధతుల పంచాంగములేల ప్రచురించి యుండిరో దురూహము' అని పరిషత్తువారు మామీద ఆభాసదోషారోపణ చేసియున్నారు.

మేము పూర్వమునుండియు రెండుపద్ధతులను చూపి ఒకమార్గమందు సత్యత్వమును, మరియొక మార్గమందు అవాస్తవికతను నిరూపించి దేశప్రజల కొరకు, చూపించెడి వారము అందేదిన్యాయమో దానిని ప్రకృతం ప్రచురించుచున్నాము. ఇట్టిపరిస్థితిలో 1,2 సంవత్సరముల పూర్వమువరకు రెండు ఎందుకు ప్రచురించినారని పూర్వపక్షము లేవదీసినారు. దానికి శాస్త్రీయమగు సమాధానమును

చెప్పు చున్నాము. అనాది నుండియు శాస్త్రకర్తలగు అనేక గ్రంథకర్తలు శాస్త్రీయ నిర్ణయము చేయవలసి వచ్చినపుడు, పూర్వపక్ష సిద్ధాంతములను జూపుచున్నారు. మేమును ఆమార్గము నే అనుసరించి చూపినారము. దీనినే కాళిదాసు ఇట్లు చెప్పెను. నయువిద్భిర్న వేరాజ్ఞా సదస చ్చోపదర్శితమ్ పూర్వపీ వాభవత్పక్ష స్తస్మి న్నాభవ దుత్తరః నిజమును తెలియుటకు సత్యాసత్యములను చూపించ వలసిన ఆవశ్యకత శాస్త్రసంప్రదాయ మగుటచే మేమును ఆమార్గము నే అవలంబించినాము. ఈ విషయము శాస్త్రీయదృష్టితో చూచిన దురూహము కానేరదు, అని మనవిచేయుచున్నాము.

(9) 1980 జనవరి 30 తేదీన ఆంధ్రప్రభలో (1) 'నిరయనపద్ధతియే అనూచానమైన భారతీయపద్ధతి. దీనిని బట్టియే అధికమాసక్షయమాస వ్యవస్థ ఏర్పడుచున్నది. పాశ్చాత్యసాయనపద్ధతి మన కర్మకాండ కనుకూలించదు.' అని పరిషత్తు వారి సభలో మొదటితీర్మానమున పేర్కొనబడినది.

దానిని పురస్కరించుకొని మేము 1930 మార్చి 7 తారీఖు ఆంధ్రప్రభలో ఈ విధముగ విమర్శించినాము. 'మన ఆంధ్ర దేశములోని పంచాంగ కర్తలు, పంచాంగసంఘము కూడ నిరయన పద్ధతినే గ్రహించి పంచాగాలు రచిస్తున్నారు. సాయనపద్ధతి కర్మకాండ విషయమున ఎక్కడా ఆచరణలో లేదు. కనుక ఈ తీర్మానము చర్వితచర్వణమే గాని వివాదగ్రస్తమైన దానివిషయంలో తీర్పు కానేరదు'' అని

దీనిపైని పరిషత్తువారు 16-6-1980 సమాలోచన పత్రికలో పంచాంగ గణితము, నిరయనపద్ధతిని సాగించినపుడు దృక్సిద్ధికై అయనాంశ సంస్కారాదికము గావించుట అవసరమనుకొన్నపుడు సాయనపద్ధతిలోనే పంచాంగ గణితము కూడ విల సాగింపరాదను ప్రశ్నకు సందేహమునకు ఆస్కారము లేకుండ నిరయణపద్ధతి పంచాంగరచన కావించుట సమంజసమే యని నిర్ధారించుట అవసరమయి యుండ అప్రయత్నము నాక్షేపించుట యుచితమా ?'' యని ప్రశ్నార్థకముగ సమాధానము చెప్పినారు.

పైసమాధానము చూడగా ప్రకృతములో ఎవరును సాయనపంచాంగమును రచించుటలేదని స్పష్టము. ఇక ఎప్పుడైనా ఇట్టి సంఘటన కలుగునేమో యని ఈతీర్మానము చేసియున్నట్లు స్పష్టము. కనుక ప్రస్తుతము వివాదగ్రస్తమైన విషయము గాదని వారంగీకరించినట్లు స్పష్టము - కనుక ఈతీర్మాన మెట్లున్నదనగా 'కొనగలగేదె పెట్టగలపాదును తినెను'అన్నట్లున్నది కావున ఈతీర్మానము అప్రస్తుత మని స్పష్టము.

(10) 'అయనాంశనిర్ణయ విషయమున ఇంకను పరిశీలన అవసరమని దూరదృష్టితో గావించిన తీర్మానము ఆభాసమని...... యెంత రమణీయమో ఆలోచించ వలసియున్నది అని పరిషత్తు వ్రాసియున్నారు.

ఉపపత్తిందుశేఖరమున దుర్గాప్రసాద ద్వివేది మహాశయులు అయనాంశ నిర్ణయ సందర్భమున ఇట్లు పేర్కొనియున్నారు.

'ఇత్థం చ పూర్వదర్శితైనైవ పథా అయనాంశజ్ఞానం సుశకమ్ । అముమేవ పన్థానం సిద్ధాన్తదర్పణకర్తా చంద్రశేఖరసామన్తః । సిద్ధాన్తశిరోమణి పరిష్కారా విష్కారకో బాపుదేవశాస్త్రీ । గణిత గోల పారదృశ్వా సుధాకరద్వివేదీచ ఆశ్రయం తే। అత్రైవ యూరోపీయనగణిత సామ్రాజ్య ధురంధరః కేతకీ కర్తాపిదత్తహస్తావలంబ ఇతి ప్రాచా మర్వాచాం చ ద్వావింశత్యంశాసన్నే 2- యనాంశే సహానుభూతి రస్త్యేవ...... అస్మిన్విషయే 1798 శకే కాశ్యాం భట్టసఖారామ బాపుదేవశాస్త్రి రానడోపాఖ్య బాలశాస్త్రి సుధాకర ప్రభృతీనాం చ సంమతయోపి పంచాంగోపపాదనపుస్తకే ముద్రితా ఇత్యలమ్ ।

వేంకటేశ కేతకరులు ఈప్రకారముగ చెప్పిరి.

అష్టాదశాయనాంశానాం ప్రచారోపి తేషాం స్వతంత్రత్వాత్ । నవీనత్వాత్ మునినిర్ణీతవిభాగ విరుద్ధత్వాత్ సులభదృశ్యవైషమ్యా చ్చ ఇదానీం క్రమేణ లుప్తప్రాయాః ।

తస్మాత్పరంపరాశుద్ధాః గణితశుద్ధాః శాస్త్రశుద్ధాఃయే 22 అయనాంశాః తే ఏవ అత్ర మయా ఆదృతా, లక్షితాశ్చ ! సర్వైఃపంచాంగకర్తృభిః తేఏవ సంగ్రాహ్యఇతిబిజాపురే శా.శ. 1850 ఆశ్విన శుక్ల 10 మి. విజయా

కేతక రాహ్వో రామకృష్ణసూనుః వెంకటేశః

ఇత్థం ద్వితీయవారముద్రిత జ్యోతిర్గణితే వర్తతే ॥ఇతి॥

నూరు సంవత్సరముల క్రితమే కాశీలో జరిగిన సమ్మేళనములో సఖారామపండితులు బాపుదేవశాస్త్రి, బాలశాస్త్రి, సుధాకరద్వివేది పండితులు 22 అంశాసన్నమున అయనాంశలు అంగీకరించినట్లు కేతకరు అయనాంశలతో సరిపోవుచున్నట్లు దుర్గాప్రసాదద్వివేది గారు ఉపపత్తిందుశేఖరమున చెప్పినారు. మరియు వీరి సంతకములు బాలశాస్త్రిగారి సంతకముతో సహా పంచాం

గోపపాదన పుస్తకమునందు ముద్రితమైనవి కలవు అని దుర్గాప్రసాద ద్వివేది గారు వ్రాసినారు. కేతకరులును 50 సంవత్సరముల క్రితము 18 అయనాంశలు స్వతంత్రములు, నవీనములు, మునినిర్ణీత విభాగమునకు విరుద్ధములు, వైషమ్యాము సులభముగ ప్రత్యక్షము కనుక ఇప్పుడు క్రమముగ లుప్తసదృశములు. ఆకారణము వలన పరంపరాశుద్ధములు, గణిత శుద్ధములు, శాస్త్రశుద్ధములు అగు 22 అయనాంశలు నాచే ఆదరించబడినవి, రక్షించబడినవి. పంచాంగకర్తలు అందరు 22 అయనాంశలనే గ్రహించవలెను. అని ప్రమాణీకరించిరి. అట్టి మహామహులచే నిర్ణయింపబడిన తీరుననే వేపారామేశం పంతులుగారి తీర్మానము, విన్నా అప్పారావుగారి తీర్మానము, రామచంద్రపురం సభాతీర్మానము, పంచాంగ సంశోధన సంఘువారి తీర్మానము, ఢిల్లీసభవారి తీర్మానము, కంచివారు గ్రహించిన అయనాంశలు, శృంగేరివారు గ్రహించిన అయనాంశలు, ప్రకృతం 23 అంశలలో నుండుట వలన అయనాంశవిచారణ అనవసరమగుటచే ఆభాసతీర్మానమని మేము విమర్శించినాము. శ్రీ బాపుదేవశాస్త్రిగారు, శ్రీ సుధాకర ద్వివేదిగారు, శ్రీదుర్గాప్రసాద ద్వివేదిగారు ప్రాచీనపద్ధతినే నిర్ణయించినట్లు 'ప్రాచా మర్యాచాంచ' అని దుర్గాప్రసాదద్వివేదిగారు చెప్పినారు. మన ప్రాచీనులు భారతీయ సిద్ధాంతానుసరణముగ నిర్ణయించుట చేతనే పంచాంగ రచన ఇదమిత్థమని నిర్ణయించుటకు పరిషత్సభాధ్యక్షులకు గాని, నిర్దేశలకు గాని శక్తిలేకపోయిన దని బుజువైంది అని విమర్శచేసినాము. అది సత్యప్రవచనమే గాని అధ్యక్షులనుగాని, నిర్దేశలనుగాని తొందరపాటుతో ఈసడింపు దృష్టితో వ్రాయలేదని మనవిచేయుచున్నాము. ఉన్న యథార్థము చెప్పవలసి వచ్చినందులకు శ్రమ కలిగినచో పరిషత్తువారిని క్షమించమని కోరుచున్నాము. శాస్త్రీయ విషయములు పత్రికలో ప్రకటన చేసిన మంచి చెడ్డలను విమర్శించే వాక్కు ప్రతి మానవునకు కలదు. విమర్శలో ఉన్న మంచి చెడ్డలను చూపుటయేగాని అగౌరవపరచి అమర్యాదగా ప్రవర్తించుట మాధర్మము లక్ష్యము కాదనియు వాస్తవమునే, జరిగినదానినే చెప్పినామనియు మనవి చేయుచున్నాము.

(11) 1980 జనవరి 30 తారీఖు ఆంధ్రప్రభలో 'కాశీపండితులు మురారిలాల శర్మ సూర్యసిద్ధాంత రీత్యా ఒక పంచాంగం, దృక్సిద్ధాంతరీత్యా కమిటీ వారి పంచాంగం కూడ ఉండడం మంచిదని కర్మకాండకు సూర్యసిద్ధాంత పంచాంగాన్ని గ్రహణాదులకు కమిటీ వారి పంచాంగాన్ని అనుసరించాలని సూచించారు.' అని కలదు.

దానిని పురస్కరించుకొని మేము శుక్రవారం 1980 మార్చి 7 తారీఖు ఆంధ్రప్రభలో ఈవిధంగా విమర్శ చేసినాము. 'రెండును ఉండవలెననుటలో భూగర్భ, భూపృష్ఠములు అనగా ఒకే వృత్తములో కేంద్ర పరిధులకు సంబధం లేదనుటలో అచట సమావేశమైన పండితులకు దృక్సిద్ధమనగా నేమియో అర్థంకాలేదని తేటతెల్లమవుతోంది. కారణమేమనగా అన్ని సిద్ధాన్తములయందు దృగ్గణితమును గూర్చి చెప్పబడినది. ఆ సంగతి వారు గుర్తించలేక సిద్ధాంతరీత్యా ఒక పంచాంగం దృక్సిద్ధాంతరీత్యా కమిటీ వారి పంచాంగం ఉండడము మంచిదనుటలో పస లేదు' అని శాస్త్రీయము, గోళీయము అగు విషయములకు విరుద్ధముగాను విమర్శచేసినాము.

ఇట్టి పరిస్థితిలో పరిషత్తువారు16-6-80 సమాలోచన పత్రికలో జ్యోతిశ్శాస్త్ర తీర్మానములో అని ప్రారంభించి...... ఔచిత్యం వారికే తెలియవలెను' అని వ్రాయుచు మా యందు దోషారోపణ చేసియున్నారు.

మేము సభాతీర్మానములో 'సిద్ధాంత రీత్యా ఒక పంచాంగం దృక్సిద్ధిరీత్యా ఒక పంచాంగం ఉండడం మంచిది' అని నిర్ణయించినారని లేనిదానిని ఉన్నట్లు వ్రాసినామనుటచే పరిషత్తువారు రజ్జుసర్పభ్రాంతిని పొందినారనుటలో సందేహములేదు. అచట సభలో సమావేశమైన పండితుల అభిప్రాయమును విమర్శించగా తొందరపాటుచే తీర్మానమును విమర్శించినామనుకొనుట పరిషత్తువారికి మా మీదగల భావావేశముచే లేనిది ఉన్నట్లు కనుపడినదనుటలో సందేహములేదు.' అని కలదు చి

(12) తాము చేర్కొన్న అయనాంశలనే గ్రహించి నాటికి 99 పంచాంగ రచన చేయుచున్నట్లు పిడపర్తివారు వ్రాసియున్నారు అది సత్యనిరూపణకు నిలుచునది కాదు. అని పరిషత్తువారు మేమసత్యము వ్రాసినట్లు చెప్పినారు.

మేము నిరాధారముగ అనిన మాట కాదు. కమిటీవారు 1953 A-D. నాటికి భారతదేశములో అన్ని ప్రాంతములనుండి ఏ పంచాంగకర్త ఏ అయనాంశలను గ్రహించెనో పట్టిక యిచ్చినారు. అది చూచిన సత్యనిరూపణకు నిలుచునో లేదో తెలియగలదు. అని మనవి చేయుచున్నాము.

(13) పిడపర్తివారి చైత్రపక్ష వాద ఆయనాంశాయనాభావ కాలములు సత్య దూరములని, తప్పని మధుర కృష్ణమూర్తి సిద్ధాంతిగారు సహేతుకముగా సప్రమాణముగా వేరే సమాధానము వ్రాసియున్నారని పరిషత్తువారు వ్రాయుట ఎంతయో అనుచితమైనదిగ మనవి చేయుచున్నాము.

పరిషత్తువారికి మధురవారి వాదమే న్యాయమని, ధర్మమని తోచినపుడు, ఈ అసంపూర్ణతీర్మానము లెందుకు? ధైర్యముతో అధ్యక్షుల చేతను, నిర్ణేతల చేతను, మధురకృష్ణమూర్తి సిద్ధాన్తిగారి పద్ధతే న్యాయమనీ, అనుసరణీయమనీ, పరిషత్తు వారు ఏల నిర్ణయము చేయించలేదో ప్రజలకు సమాధానము చెప్పవలసిన బాధ్యత తమయందు కలదని మనవి చేయుచున్నాము (దేవద్రవ్యము-ప్రజాద్రవ్యము సభకు వినియోగమైనది).

—: ఫలితార్థము :—

రాజమండ్రి జ్యోతిష సభాతీర్మానముల సారాంశ మిట్లున్న దనుటలో సత్య దూరత లేదు.

శ్లో॥ మృగతృష్ణాంభసి స్నాతః
ఖపుష్ప కృత శేఖరః
ఏష వంధ్యాసుతో యాతి
శశశృంగ ధనుర్ధరః

ఇట్లు - సహృదయ విధేయులు,
సోదరులు
పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,
పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రి.
23-7-1980 పొడగట్లపల్లి.

(ఆంధ్రప్రభయందలి పిడపర్తి సోదరుల మొదటివ్యాసము, వేదశాస్త్ర పరిషత్తువారి సమాధానము, శ్రీ మధుర కృష్ణమూర్తిశాస్త్రిగారి సమాధానము, శ్రీ పిడపర్తి సోదరుల ప్రత్యుత్తరము చదివిన పాఠకులు ఆయా రచనలలోని ఔచిత్యానౌచిత్యములను గూర్చి సంగ్రహముగా వ్రాసిన 'సమాలోచన' ప్రచురింపగలదు)

— :0: —

# ఆంధ్రపురాణ ప్రశంస

— శ్రీ రామవరపు వేంకటేశ్వరశర్మ.

* శ్రీకారంబును జుట్టె గాద! కవితా
'శ్రీఖండ' చర్చావిదుం
డేకైకమ్ము 'పురాణ' 'చైత్రరథమం'
దింపార నావాహనన్
లోకస్తుత్యకు వాణికిన్ సలిపి సు
శ్లోకాక్షరార్చా కళా
లోకంబందుటలోన పిన్నలకు నా
దూర్థంపుటాదర్శమై॥

*మధురామోద రసప్రఫుల్ల గుణసం
పన్మానసాబ్జుండు, వాక్
సుధలన్ జల్లి పసందుగా జిందు కవితా
శుభ్ర ప్రపూర్ణేందుడౌ
'మధునాపంతుల' వంశ శేఖరుడు శ్రీ
మ 'త్సత్యనారాయణుం
డు' ధరన్ దక్కగ కర్త కర్హుడె! తద
న్యుం డెందు భావించినన్'

* అనవద్యోదిత గద్య పద్యరచనా
వ్యాపారపారీణమై
ఘనభూపాల మహేతిహాస కథనా
క్రమ ప్రభాస్ఫూర్తి శో
భనమా 'ఆంధ్రపురాణ' కావ్యమున క
ద్దాల్ పాలికీనాడు నిం
డెనటే! సర్వరసజ్ఞ చిత్తముల పం
డెన్ మోదసస్యప్రభల్ ॥

*ప్రతిపర్వరసోదయమై
ప్రతి దీనికి లేదటన్నపగిది నుదంచత్
ప్రతిభావ్యుత్పత్తు లొలయ
కృతిసేసి రచించెనౌర! కీర్తిస్ఫూర్తిన్॥

*ఒకయెడ చరిత్ర దృష్టియు
నొకయెడ సాహిత్య సృష్టియొక్కం తేనిన్
కకవికలు గాక రెండున్
వికసనమును బొందె బదులు పేకయు బో
బోలెన్ ॥

*పదపదమందు దుదాత్తరస
వత్తర భావవికాస భవ్య సం
పదపాదలన్, మహాభ్యుదయ
మాన్యకమాశయ దివ్యబోధనా
స్పదముగ, నూతనాంధ్రకృతి
సంచయమందున నగ్రగణ్యమై
పొదవ, రచించెనౌర! మహి
మోన్నతి 'నాంధ్రపురాణ'
కావ్యమున్॥

* ఒడలుప్పొంగు సమూత్సుకత్వమిడు నా
యుద్ధంపుఘట్టమ్ము లో
క్కడ గుండెల్ వడి బిండిచేయు కరుణా
గీతి ప్రసారమ్ము లో
క్కడ, సాహిత్య కళాప్రసంగవిసర
త్కీర్తిప్రభామూర్తు లో
క్కడని 'యాంధ్రపురాణ' కావ్యమున మే
ళ్ళోక్కడల్ వెలారించెఁ బో॥

* అమృతపు జోతి నిల్పు కృతి
యౌగద! నాటి గుణాఢ్య కావ్యమో
మము, మనశబ్దశాసను స
మంచిత భారతకావ్య కృద్విధా
నము, కవిసార్వభౌముని ఘ
నంబగు నక్కవికాభిషేక ప
ర్వము పొందనైన గాథలు ప
రంపర 'నాంధ్రపురాణ' మిమ్మహిన్.

*శారదదాతి వేళలఁ బ్ర
సన్నగతి స్ఫురణంబు గల్గి గో
దారి వలెన్ జెలంగు కవి
తా విభవాన్వితమైన అమ్మహా
భారత మాంధ్ర రాణ్ణికర
భవ్యపురాణము రాణ్మహేంద్రమం
దేగి సుయించు మెన్నగను
హీన్ గను చిత్రములైన లీలయౌ॥

* 'అమలోదాత్తము, ధర్మనిర్వహణ మ
ర్యాదమ్ము' ఆంధ్రప్రభా
వము లోకంబున నెంతదాక మిగులన్
వ్యాపించునో అంతదా
క, మహోదార కథాసుధా ద్రవ కవితా
కల్యాణపూర్ణ ప్రకా
శము నీ 'యాంధ్రపురాణ' మొప్పుత! ప్రశ
స్తంబై సుధీసేవ్యమై ॥

* * *

## ఋతు ఘోష – ఒక పరిశీలన

— శ్రీ పి. వి. యస్. ఆర్. కె. శర్మ.

కాలచక్ర గమనంలో ప్రకృతిలో గల్గు మార్పులకు చిహ్నములే ఋతువులు. మానవుడు నిత్యజీవన వ్యథాకంటకావృత పథగామియై అనుక్షణము కంగూచు ప్రకృతిచేతనే ఊరట పొందుచున్నాడు. ఈ జీవిత సుమము వలిగిపోవలసినదికాదు. దీనిలో ఎంతయో పరిమళము, సౌందర్యము, గలవని తెలుసుకొంటున్నాడు. ప్రకృతిలో బుట్టి ప్రకృతిలో పెరిగిన ప్రాక్తన మానవునికి కారణమైన కోటిమానవుడు ప్రకృతి నుండి ఎన్నియో జీవితసత్యాలను పిండుకొనుటేకాక, దేవత అని వేరు వేరు పేర్ల నుంచి ఆరాధించుటేగాక, అచేతనమైన ప్రకృత్యంశములను చేతనములుగనే భావించునంతటి తాదాత్మ్యము ప్రకృతితో మానవునకేర్పడినది. కావుననే మేఘములను, పిల్లతెమ్మెరలను, హంసలను కీరములను ఆత్మీయులుగా భావించి వానితో తనగోడు చెప్పుకొన్నాడు, సందేశములు పంపినాడు.

ప్రకృతి సౌందర్యమునకు ముగ్ధులు కానివా రెవరు? ఇక కవుల విషయము చెప్పబనియేమి? ప్రకృతిని తిలకించి పులకించిన కవిశ్రేష్ఠులు తమ కావ్యములందు ప్రకృతికి మహోన్నత స్థానము నొసగినారు. కొందరు కవిపుంగవులు ప్రత్యేకముగ ఋతుకావ్యములనే వ్రాసి యుండిరి. కొందరు తాము వ్రాయు కావ్యములందు అడనడ ఋతువర్ణనలు ప్రవేశపెట్టి తమ సౌందర్య తృష్ణను తీర్చుకొనిరి.

గుంటూరు శేషేంద్ర శర్మగారు రచించిన 'ఋతుఘోష' యను ఋతుకావ్యము గత దశాబ్దారంభమున వెలువడినట్టి ఉత్తమ కృతిరత్నము. వీ రింతకుమును పు మాత్యు ఆర్నాల్డుయొక్క ఆంగ్లానువాదమైన 'సొరాబు_రుస్తుము' నకు 'సొరాబు' పేర ఆంధ్రానువాదముగ పద్యకృతిని వెలువరించిరి. వారిపద్య రచనా నైపుణి, భావనాశక్తి, వారి యాత్మఘోష ఋతుఘోషయం దల్లెడల విస్తరించియున్నది.

'నాకవిత్వం నాటినుండి నేటివరకు గమనించిన వాళ్ళకు ఒక అంతర్లహరి అన్నిటిలో అనుస్యూతముగా ప్రవహిస్తూ ఉండటం ద్యోతకమౌతుంది' అన్న శేషేంద్ర వాక్యాలు నిజమని తెలియును. నాటినుండి ఇటీవల వెలువరించిన 'సముద్రం నాపేరు' వరకు వీరికవిత్వమందంతట సౌందర్య పిపాస, వ్యథార్తజీవుల యథార్థదృశ్యాలు గోచరిస్తూనే ఉంటాయి.

'వ్యథచే దీనులగాథ కొక్కటయినన్
బాష్పమ్ము రాదన్న చో
పదబంధమ్ములు బంధుర ప్రణయ భా
వస్పంద సందోహముల్
మృదులమ్ముల్ పదివేలు కూర్చు మది సా
హిత్యమ్మె రాహిత్యమై
నిదురం బోవును గాక కాలకుటిలో
నిర్గంధ బంధూకమై'[1]

అన్నది వీరి కవితాదర్శము. వసంత ఋతు సౌందర్యముచే పలువిధముల నానందించుచున్నను, కూలివాని దైన్యము ఎదను కలంచగా నీవిధముగా చెప్పినాడు.

'చేలం బూవులు వెక్కిరించె గగన
శ్రీ చంద్రరేఖాంకమై
వేళాకోళము చేసె తోటవనిలో
వేలాడి తోరావళుల్
గోలం జేసెను, చింతకొమ్మ పయినం
ఘూకంబు శోకించె నా
కూలీవాడు కుటీరగర్భమున నా
క్రోశించె దైన్యంబునన్.

ఈవిధముగా కవిప్రకృతికి భావప్రపంచానికి తనవ్యక్తిత్వము నాపాదించిన తీరు మనల నాకర్షించును.

చలిపులివోలె దారుల ప
చారులు చేయుచునుంట ఊరికా
వల పెనుమఱ్ఱికింద నెల
వంకయె దీపముగా వరున్న పే
దల పసిపాప లెవ్వరికి
తప్పదలంచిరి? కాలమే నాలా
హాలమయి పోయి యాశిశువు
లాకలితో చలితో నశింపగన్.

దీనుల యెడ నింతసానుభూతి, జాలి ఉన్నది కాబట్టే

'ఎక్కడ తిండిలేని పసివాడు దూడను మేతకు తీసుకుపోతున్నాడో, ఎక్కడ పసితనంకూడా బతకడానికి పనిచెయ్యాలో అక్కడ నాకాళ్ళు నిజంగా తెగిపోయాయి నాచేతులు నిజంగా రాలిపోయాయి. నానాలుక నిజంగా కడిపోయింది. అక్కడ నేను మహాప్రవాహాన్నికాను; అక్కడ నేను ఝంఝామారుతాన్ని కాను. ఆ పసివాడి కాళ్ళముందు కడిపడు కన్నీళ్ళపోతా ఆ కాళ్లమీద; నాఆత్మలో ముత్యాలకండె తెగి ఆతని ప్రోలపడిపోయింది[2] అని వ్రాసియున్నారు. అనుభూతిలో ఇంతకంటె పరాకాష్ఠ అసాధ్యమైనది కదా!

'పండు వెన్నెల రాదేల పంచగించి
చితికిపోయిన దీనుల జీర్ణకుటికి'_
'కన్నుదోయినీ, అమృతయూఖరేఖలకు
అర్రులు చాచెను లోక బాంధవా'_
'పురాతన యాతనలన్న చీకటుల్
ప్రిదులు తెరంగునన్ శరద్యుతిం గురియుం
పవదేల నో ప్రభూ!

'శిథిలజీవుల నీరాక కెదురు చూచె
... ... ...
తెరలుతొలగించి రావోయిఅరుణమూర్తి?'

మొదలైన విధముగా కవి తన ఆవే

నను ప్రతిపద్యమునందును వ్యక్తపరచిరి. రిక్షాలాగు వ్యక్తినిగూర్చి చెప్పినపద్యము హృదయము నార్ద్రపరచుచున్నది.

వివిధ నిమ్నోన్నత వీథులం బరుగెత్తి
 వైశాఖిలో మేను వాల్చె నొకడు
ద్రాఘిష్ఠ ఘంటాపథ స్థలం దిరుగాడి
 బెజవాడ కన్నీరు వెట్టె నొకడు
మధ్యాహ్న పరితప్తమార్గమ్ములం బోయి
 గుంటూరులో కుప్ప కూలె నొకడు
కాలాహి కుటిలత్వం గాటుకమ్ములు జుట్టి
 నెల్లూరిలో సొమ్మసిల్లె నొకడు
క్రూర దారిద్ర్య దుర్వ్యధికారణమున
త భుజాగ్రము నెక్కు భేతాళమూర్తి
సర్వకాలానువర్తి రక్షా ధరించి
లాగలేకను వేసవికాగలేక.

గ్రీష్మమున వివిధ సమయములం దాకాశపు వెలుగు లేవిధములు గానున్నవో చెప్పిన తీరు మనోజ్ఞమైనది.

'ప్రత్యూషముల దశాఫాలభాగమ్ముల
 కెందమ్మి విరిచాయ గీలుకొల్పు
కలిపవేళల విశ్వకవాటాంతరములందు
 గుమ్మడిపూవన్నె గుస్తరించు
మధ్యాహ్నముల నభోమండలాధ్వము
 లందు
 మల్లెదండల శోభ వెల్లిగొల్పు
అపరసంధ్యల రమ్యవిపిన నిర్ఝరులందు
 సిందూరకాంతులు చిలుకరించు
కాలకంఠుని ఫాలాక్షి కాలుచిచ్చు
దావపావక దీప్తికి జీవగఱ్ఱ
పశ్చిమానిల వీచికి పట్టుగొమ్మ
అవతరించెను గ్రీష్మ కాలాతపమ్ము.

'ఏలాగో ఒకనాడు అశిశువుతే
 యింధాన మాగాక యుం
ద్వేలక్షోభ నభోంతరాళ మెగయన్
 విశ్వప్రజాలోచనో
న్మీలంబై హృదయాగ్ని పర్వత మహా
 నిర్ఘోషరోషానల
జ్వాలాజాల కరాళ జిహ్వికలు తు
 చ్ఛంబైన యీలోకముం
గూలం జేయును గాక; యీ వచన మే
 ఘూర్ణిల్లుగా కంతటన్'

ఆ పద్యములో శోభించిన మహర్షి శాప వాక్కు ధ్వనించుచున్నది.

'ముగ్ధరీక్ష్య ప్రజా ఘూర్ధరచ్ఛటలతో
 తత జీవనుల శిక్షించినాడు
పటురోషకాషాయ కుటితాంశు కళలతో
 గోగణంబుల చావగొట్టినాడు
ఖామయూఖ క్రూరఘనకాండపటలితో
 విహంగ జాతుల క్షోభ పెట్టినాడు.'

ఇత్యాదిగా నున్న ప్రచండగ్రీష్మము దుర్జన రాజ్యశాసనముతో పోల్చబడిన నై సీసమే కాక

'ఘనఘనాఘన గర్జవేయ ఘంటికా
 టంకారములకు ఘంటాపథంబు
శక్రచాపోదగ్ర శార్దూలశాలనా
 విభవోన్నతికి భూరివిపిన సీమ
చటులఝుంఝూమరుచ్చత కోటి భేతాళ
 లుంఠన క్రియలకు రుద్రభూమి.'

ఇత్యాదిపద్యములను రచించిన వీరిపద్య రచనలో శ్రీనాథుని పోకడ లున్నవని పుట్టపర్తివారు, సోమసుందర్, శ్రీశ్రీ, మొదలైన విజ్ఞులు అభిప్రాయ పడుటలోని సామంజస్యము తెలియగలదు. వ్యావహారిక భాషలో పద్యరచన రసవత్తరముగా చేయగల వీరిశక్తికి క్రిందిపద్యము మచ్చుతునక.

'ఓ పరమేశ్వరా!' యీచట
 నుంటివి నీకసలుంటివా ప్రజా
తాపములం భరించుటకు
 సాధ్యముగాదని పాత పెత్తనం
బీపయిసాగబోదని యె
 రేటి పరారయినావ? బాధలం
బాపగ లేవు నీవు శిల
 వాకలవా సెలవీయు మోప్రభూ!'

'ఆత్మపక్షాలను విప్పి తేచెను వికస్వర జీవ మహోదయమ్మునన్' అనియుం ఊహా విహాయసమ్మునా నెగిరి పోనాశించె నత్యంతమో' అనియూ ఇంకను పలు పద్యములందు ప్రకృతిలోని కెగిరి లీనమై పోయే కాంక్ష వ్యక్తపరచబడినది.

'కలికిగులాబి కేలగొని
 కమ్మని తెమ్మెర నెక్కి, కెం
పుం దలిరాకు బాకు నడు
 ముం గులికింతువుగాని చూడు నీ
జిలుగు పసిండి దువ్వలువ
 చీరచెరంగున భాగ్యశోక పం
కిల కలనాకళంకములు
 గీల్గొనె మేల్గొనవోయి మిత్రమా!'

ఈ మొదలైన పద్యములను పరిశీలించినచో కవి ప్రకృతిసౌందర్యప్రవాహమున కొట్టుకొనిపోతూనే వెంటనే గుర్తుకొచ్చిన అభాగ్యజీవుల శోకాన్ని నివారించవలెననే తీవ్రకాంక్ష ఎంత మిక్కుటముగా గల్గియుండెనో తెలియుచున్నది. ఈవిధముగా వీరి కవిత ఆపాతమధురమూ, ఆలోచనామృతమూ, నై యున్నది. ఇక్కడ 'ఆలోచన అంటే, ఊహాని పెంచడం వ్యథన్ని చింపడం, సుధల్ని పంచడం (శ్రీ. శ్రీ)

'పరిచయ వాక్యాలు' లో పుట్టపర్తి వారు శర్మగారి కవితలపైగల సానుభూతి, వారు బాగుపడవలెననే ఆత్రము. ఇంకా బాగుపడలేదమనే అక్కసూ, కర్మవాదంపై విశ్వాసమూ, ఇన్ని భావాలమధ్య నలిగి, నలుగుతూన్న ఆత్మ పెట్టే ఘోష 'ఋతుఘోష' మని తెల్పిరి.

ఈ కావ్యమును శ్లాఘించుచు 'కావ్యతత్త్వ ప్రకాశము' న విశ్వనాథవారు 'ఇట్టి రచన చేయగలవారీనాడు పట్టుమని పది మందియైనను లేరు' అనిరి.

'హిమబిందు సుందరి', 'గులాబి జిలేబి గిన్నెలు', 'గుడ్డిముసలమ్మలాగున్న గదిలో దివ్వె' మొదలైన ఉపమానము లెంతో

(తరువాయి 12 వ పేజీలో)

# ఊతపదాలు - వైశిష్ట్యం

— శ్రీ ఎం. సి. కనకయ్య.

భాషా వ్యవహారంలో ఎన్నో పదాలు దొర్లుతూ ఉంటాయి. అందులో కొన్ని సార్థకాలు, కొన్ని నిరర్థకాలు, నిరర్థకాలని తెలిసికూడా ఆ పదాలని పదేపదే ప్రయోగిస్తూ ఉంటాము. అదే వాటి వైశిష్ట్యం. ఇట్టి ప్రయోగాల్లో కొన్ని నిరర్థకాలు సార్థకాలుగా పర్యవసిస్తే పర్యవసించవచ్చు.

పోతే, మనలో కొందరు తాము పలుకబోయే ప్రతి వాక్యమందూ ఒక్కో మాటని ఉపయోగిస్తూ ఉంటారు. ఆ మాటకు విడిగా అర్థం ఉండవచ్చు. ఉండకపోవచ్చు. కాని ఆమాట వారి సంభాషణలో సదా పునరావృత్తం అవుతూ ఉంటుంది. అదే దాని వైశిష్ట్యం. ఇట్టి విలక్షణ పద సముదాయాన్నే ఊతపదాలు అనవచ్చు.

ఊతపదాలలోనే ఉన్నది 'ఊత'. ఇది ద్వివిధం. ఉన్నతం లేక బలీయం, నిమ్నం లేక హీనము అని. ఈ ఊతకేవలం అచ్చుమీద ఉండవచ్చు హల్లుమీద ఉండవచ్చు. ఇచ్చట హల్లు అంటే అజ్విహీనమైనదనే భావించాలి. సంయుక్తాక్షరంపై కావచ్చు. ద్విత్వాక్షరంపై కావచ్చు. లేక ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క పదం మొత్తముపైనే ఊత ఉండవచ్చు. ఈ ఊతయొక్క స్వరూపాన్ని బట్టి ఉచ్చారణలో తీవ్రత, అనాదరం మున్నగునవి విస్పష్టమౌతాయి. తదనుగుణంగా శబ్దంలో ఒక విరుపు కాని ఊపు కాని వస్తుంది. శబ్దానుగుణంగా అర్థంలోనూ అట్టి మార్పు గోచరిస్తుంది.

ఊతపదం ఉపయోగించకయే స్వేచ్ఛగా వాక్యాన్ని ఉపయోగించే వాగ్నిపుణులూ లేకపోరు. కాని ఊతపదాల ఉపయోగం మాత్రం బహుళం. అంటే సాధారణంగా ఏదో ఒక ఊతపదం ప్రతినోట దాగిఉండి ఆయా సందర్భాల్లో బయల్వెడలుతూ ఉంటుందన్న మాట.

ఊతపదాలను ఉపయోగించే వారు తద్విరహితంగా స్వేచ్ఛగా మాటలాడలేరు. ఈవిషయం శ్రద్ధగా గమనించినచో విస్పష్టమౌతుంది. ఆ ఊతపదాన్ని ఉపయోగించడం వారికొక తప్పని సరి అవుతుంది. కాబట్టి ఆ ఊతపదం ఉపయోగించకపోతే వారి సంభాషణలో లోపం స్పష్టంగా తెలుస్తూనే ఉంటుంది.

ఈ ఊతపదాలు వింగడింపుడు దొరకొంటే కష్టతరం అవుతుంది. ఏమంటే

1. ఒకేరంగంలో ఉన్నవ్యక్తులుపయోగించే ఊతపదాలే విభిన్నం కావడం.
2 భిన్నభిన్నరంగాల్లో ఉండే వ్యక్తులుపయోగించే ఊతపదాలు ఏకం కావడం

1. ప్రదేశాలలో మార్పువలన
2. సామాజిక స్థితిగతుల భేదంవలన
3 సంస్కార భేదంవలన
4. వృత్తులను బట్టి

సాధారణంగా ఊతపదాల్లో మార్పులు వస్తూ ఉంటాయి. అంటే సాధారణంగా పట్టణవాసులు ఉపయోగించే ఊతపదాలకూ పల్లెవాసు లుపయోగించే ఊతపదాలకూ, భేదం ఉంటుంది.

ఉన్నతమైన విద్య నేర్చినవారు ఉపయోగించే ఊతపదాలకు లాతివారుపయోగించే ఊతపదాలకు భేదం ఉంటుంది.

వేరువేరురంగాల్లో ఉన్న వ్యక్తులు ఉపయోగించే ఊతపదాలు సాధారణంగా వేరు వేరుగానే ఉంటాయి.

ఒకేరంగంలోని వ్యక్తులుపయోగించే ఊతపదాలు సాధారణంగా ఒకేవిధంగా ఉండడానికి అవకాశం ఉంది.

అందువలన సాంఘిక, ఆర్థిక, సాంస్కృతికేత్యాది భేదాలవలన ఊతపదాల ఉపయోగంలో మార్పులు కలుగవచ్చునని ఫలితాంశం.

ఊతపదాలని 1. నాగరిక 2 అనాగరిక తెగలుగా విభజించవచ్చు. తిరిగి వీనిలో అంతర్విభాగాలూ అవీ ఉండవచ్చు. ఇచ్చట నాగరికపదం విద్యావంతులకీ రెండవపదం విద్యాహీనులకూ ఉపయోగించడం జరిగింది.

---

( 11 వ పేజీ తరువాయి )

మనోహరముగా నున్నది కావున నే

'శ్రీనాథుని క్రీడల్లో
అల్లసాని వాడల్లో
కూడా దొరకని పదచిత్రం
విచిత్రం! కడు విచిత్రం!

అన్నాను శ్రీ శ్రీ.

'సౌందర్యమంటే భౌతిక వస్తువుకు సంబంధించిన దృశ్యం కాదు. వాటిని చూచేటప్పుడు మనలో కల్గే సౌమ్యత. అది ఆధ్యాత్మిక సౌమ్యతను కూడా వ్యక్తం చేస్తుంది. అట్టి సౌమ్యత మనలో విశ్వాసాన్ని, సత్యాన్ని, సానుభూతిని, న్యాయప్రియతను, పెంచుతుంది'[3] అను వాక్యము ఈ కావ్యమునకు బాగుగా నన్వయించును.

ఇట్లు ప్రతి పద్యమందు చమత్కారము, అలంకారము, శక్తివిశేషము కల్గిన ఉత్తమ ఋతుకావ్యము 'ఋతుఘోష.'

అధస్సూచిక :-

1. శేషేంద్ర కవితా సంపుటి 'పక్షులు' లో 'శీవనగంగ' ఖండిక.
2. శేషేంద్రరచన 'నా దేశం నా ప్రజలు' లో 69 పేజీ.
3. 'సాహిత్య ప్రయోజనము' వ్యాసం - చాడూరి. 'సాధన' మాసపత్రిక - సంపుటి 12, సంచిక 2.

—...—

మును ముందుగా విద్యార్థులు ఉపయోగించే ఊతపదాలను గురించి తెలుసుకుందాం.

ఈ గణంలో చేరే కొన్ని ఊతపదాలు తస్సదియ్యా, అనాక, మళ్ళీ, మరిగంటే, ఏటంటే, ఇత్యాదులు ప్రయోగాలు తిలకించండి.

తస్సాదియ్యా : తస్సదియ్యా, ఆ సినేమా బలేగుంది బాయ్యా. దాంతస్సాదియ్యా అది ఏంజేసింది బాయ్యా. తస్సాదియ్యా చూడాలేకాని తస్సదియ్యా సెప్పడానికి ఈల్లేదనుకో.

అనాక సినేమా కెళ్లావా? అనాక టికెట్టు కొన్నామా అనాక సినేమా సూదలేశారు. ఆనాక ఈడు ఏడుపు మొదలేశాడు. ఆనాక నాను చిర్రెను కొచ్చి ఎనక్కొచ్చేశాం.

మళ్లీ : రాయిమండ్రి ఎల్లామా. మళ్లీ కోరుకొండ ఎల్లామా. మళ్లీ తంటికొండ ఎల్లామా. మళ్లీ పెంకుబడి ఇచ్చామా మళ్లీ ఎక్కి వొచ్చామా ?

మరిగంటే. మరిగంటే దోసకాయపిల్లి నిమ్మకాయలు పట్టుకొచ్చి, మరిగంటే ఆ వ్యాపదేనిపైసల కోటిఅమ్మి మరిగంటే డబ్బులు నీకిచ్చానా ?

ఇక కొన్ని నాగరక ప్రయోగాలు తిలకిద్దాం.

ఇవి 1. విద్యారంగపు వ్యక్తుల ప్రయోగాలు.

2. రాజకీయరంగపు వ్యక్తుల ప్రయోగాలు.

3. సాంసారిక వ్యక్తుల ప్రయోగాలు.

4. చిల్లరమల్లర ప్రయోగాలు.

5. వాణిజ్యరంగ ప్రయోగాలు.

మున్నగు రీతిని బహుముఖాల దర్శనమిస్తాయి.

1. విద్యారంగంలోని ప్రయోగాలలో ఎక్కువ ఉపాధ్యాయులవే, ఇవి కొన్ని తిలకించండి.

తెలిసిందా, అండర్‌స్టాండ్, యూనో, OK, ఎలాగంటే, అర్థమయ్యిందా, ఐమీన్ మున్నగునవి.

తెలిసిందా · రుద్రమదేవి యమునను రక్షించింది. తెలిసిందా? యమున రుద్రమదేవిని తన ఇంటికి పిలిచింది. తెలిసిందా ?

అండర్‌స్టాండ్ : దీని తరువాత ఈ రియాక్షన్ జరుగుతుంది. అండర్‌స్టాండ్. దీనితర్వాత ఈ టెస్టు జరపాలి. అండర్‌స్టాండ్. ఆ రియాక్షను టెస్టుకి ఏమిటో సంబంధం అండర్‌స్టాండ్.

ఓకే. మనము రాజమండ్రి పోదాము. ఓకే. అక్కడ రెండుస్టవ్వులుకొందాము. OK, ఆ పనులు అన్ని చూసి పిక్చరుకి పోదాము. OK,

ఎలాగంటే ఈ పాఠం బాగా చదవాలి ఎలాగంటే ఉదయమే లేచి చదవాలి. ఎలాగంటే శ్రద్ధగా చదవాలి ఎలాగంటే మనసు దాని పైనే ఉంచి చదవాలి

ఇదేవిధమైనవే, one thing, coming to the point, coming to our lesson, simple thing, very easy, లాంటి ప్రయోగాలు.

రాజకీయరంగపు వ్యక్తుల ఊతపదాల్లో ఎక్కువ హామీలు, మనవులు వినపడుతూ ఉంటాయి.

చూడండి, మనవి చేస్తున్నాను, చెప్పేది ఏమంటే, చెప్పొచ్చేదేమంటే, చెప్ప పోతున్నాను, చెపుతున్నాను. హామీ ఇస్తున్నాను. మున్నగునవి ఈ కోవకు చెందినవే. మనవి చేస్తున్నాను! మీకు నేను మనవిచేసే దేమంటే వెంటనే మీకు రోడ్లు వేయిస్తాము. ఇంకా మనవిచేసేదేమంటే ఇక్కడి ఆసుపత్రిని పెద్దది చేయిస్తాము. ఇక్కడి జూనియరు కాలేజీని డిగ్రీ కాలేజీగా మారుస్తామని కూడా నేను మనవి చేస్తున్నాను.

ఇక సాంసారిక వ్యక్తుల ప్రయోగాల్లో ఏంటంటే, ఎలాగంటే, పట్టెట్టార మున్నగునవి ఉన్నాయి.

పట్టెట్టా ఒరే నేను పట్టెట్టాగ పెళ్ళికి వస్తాను. పట్టెట్టార అక్కడ మనం మరల కలుద్దాము. పట్టెట్టార సరదాగా గడుపుదాము ఏం.

ఇదేవిధంగా ఏమిటంటే మున్నగు వానిని స్వీకరించవచ్చు.

ఊతపదాల్లో కొన్ని మాండలిక భేదాలవలన భేదాలు కలిగిఉంటాయి.

ఈ ఊతపదాలవంటివే ఊత చేష్టలూనూ. కాళ్ళుసహార్మనీ త్రొక్కినట్లు త్రొక్కుట, తలను ఆడించుట, చేతులను ఆడించుట, అరచేతులతో అనేక భంగిమలు ఆగక చూపుచుండుట, మున్నగునవి. వీనినే మేనరిజమ్స్ అంటారు. వీనిబట్టి వ్యక్తినిగూర్చి తెలుసుకొనవచ్చును.

ఇంకా ఎన్నో ఊతపదాలు నా మస్తిష్కానికి అందనివి వ్యవహారంలో మసలుతున్నాయి. వాటన్నిటినీ స్పృశించడానికి వ్యవధీ అవధీ చాలదు. ఈ వ్యాసాన్ని ఊతగాగొని విద్యార్థులు ఈ ఊతపదాలపై పరిశీలనకు దొరకొందురుగాక !

—:0:—

# ధ్రువమ్

— 'భారతీప్రియ'



* ఎంత ఆశాశ్వతంబు తను
వియ్యది ? ఒంటి క్షణంబులోన నే
వింతగ రాలిపోవుగద !
వెత్తిజనం బిటువంటి దాని కా
యింతగ నేడ్చుచుంట ? తగు
నే యిది ? యెన్నివిధాల జూచినన్
సుంతయినన్ ఫలంబు కన
జూతురె ? పోయినవాడు వచ్చునా ?

దేహముతోడి బంధమును
దేహముతో సహజీవనంబు సం
దేహము మాని పెంచుకొని
తెల్వినిమాలి తమంత తామె వ్యా
మోహపు బంధనాల్ మదికి
పూనుపజేతు రవెంత పెంచగా
నూహకు నందనంత మది
యున్ పెరుగన్ తెలియంగలేరహో!

* కాని తటాలునన్ తనువు
కాలము దీరగ రాలు వేళలో
కానను కత్తిరించ బడుగాద
శరీరముతోడి బంధనాల్
కాని మనస్సు నీ వరకు
గట్టిన బంధము లల్లెయుండ లో
కాన మనుంగు మానవుడు
కాని నిజం బరయంగ జాలడే!

* సకల చరాచరేశ్వరుని
చాలవిచిత్రపు లీలలందు చా
వొకటి యటం చెరుంగ దగు
నోయి ! యెఱుంగని యంతకాలమున్
వికల మనస్కుడౌ గతియె
నిమ్నవంచు నెఱింగినంత నీ
దుకసులకే నవీన మయి
తోచునురా ! జగమంత సోదరా !

* వింగు నన్నచో ఒక్క మాటంగనోయి!
కోపపడనన్న నే చెప్ప కోర్కెకలుగు
మ్మృతునికై యేడ్చు రాగాన మేళగించి
నాకు వినిపించు నేనొ దివ్యనాదము సఖ!

* అమ్మ బిడ్డారికాలు నుయ్యాల నుంచి
నిదుర బుచ్చుట కేవియో పదము లల్లి
జోల బాడెదు రాగాల లీల దోచు
మృతునికై యేడ్చు నేప్పుడో మేళగించి

— .. —

# సోషలిస్టు వాస్తవికతను పిడిగాచేసుకొన్న వజ్రాయుధం

— శ్రీ కె. మోహనరెడ్డి, ఎం. ఏ.

పెట్టుబడిదారీ వ్యవస్థపై తిరుగుబాటుగా అభ్యుదయ కవిత్వం వచ్చినదశలో సమసమాజస్థాపనకై ప్రజల పక్షం వహించి నిజాంపై వజ్రాయుధాన్ని ఝుళిపించిన కవిసింహం సోమసుందర్.

ఈ దశలోనే సోషలిస్టు వాస్తవికత సాహిత్యరంగంలో అవతరించింది. సోమసుందర్ 'వజ్రాయుధం'లో సోషలిస్టు వాస్తవికతను పరిశీలించుట ఈ వ్యాసోద్దేశం కాబట్టి ముందుగా సోషలిస్టు వాస్తవికత అంటే ఏమిటో తెలుసుకొనటం అవసరం.

శ్రమజీవులు సమసమాజ నిర్మాణం కొఱకు జరిపే పోరాట - విధానాన్ని, పోరాటపుదశలను మార్క్సిస్టు దృక్పథంతో రచనలో చిత్రించడమే సోషలిస్టు వాస్తవికత.

వజ్రాయుధంనిండా సోషలిస్టు వాస్తవికత ఎలా పరుచుకొని ఉందో పరిశీద్దాం.

సమధర్మం అన్న ఖండికలో

'తన చరిత తానే పఠించి
ఘక్కున నవ్వింది ధరణి
తన గాథను తానే స్మరించి
బోరున ఏడ్చింది ధరణి.
వృద్ధజగతి సమాధిపై సమధర్మం
ప్రభవించును
నిదుర-చీకటి వెలుపల వేకువ మెళకువ
పుట్టును.'

అని అనడం లో సోమసుందర్ చారిత్రకదృక్పథం, గతితార్కిక దృక్పథం తెలుస్తుంది.

గాలి, నీరులా ప్రకృతిలోని సంపదనంతనూ అందరు సమానంగా అనుభవించాలి కాని భూస్వామ్యవ్యవస్థలో గాని పెట్టుబడిదారి వ్యవస్థలో గాని అలాజరుగలేదు. శ్రమజీవులు శతాబ్దాలనుండి కష్టనష్టాలకు గురువుతున్నారు ధనవంతులు వాళ్ళను అణిచివేస్తున్నారు. ఇది ధరణి చరిత్ర. ఈ కన్నీళ్ళతో నిండిన తన చరిత్రను చూసి ధనవంతులను హేళన చేస్తూ ఫక్కున నవ్వింది ధరణి. శ్రమజీవులను తలచుకొని బోరున ఏడ్చింది అదే ధరణి. ఇది కవి చారిత్రక దృష్టి. సమాజ పరిణామక్రమంలో పెట్టుబడిదారి వ్యవస్థ పోయి సమసమాజం వస్తుంది. అని నిద్ర తరువాత మెళుకువలా చికటి తర్వాత వెలుగులా అత్యంత సహజంగా వస్తుందని చెప్పడం గతితార్కిక దృష్టి. చారిత్రక తత్వస్పృహ గతితార్కిక దృష్టి, సామ్యవాద వాస్తవికతలోని ప్రధాన గుణాలు.

లోపలి కోరిక అన్న ఖండికలో కవి తన తల్లితో 'సిరి సంపదలతో తులతూగే ఈదేశం నాది' ఇందులోని బిడ్డలు దిక్కుముక్కు లేని అనాథలవలె కూడుగుడ్డ లేక ఈ దారిద్ర్యపు దోపిడి వ్యవస్థలో బ్రతుక

శేరని బ్రతకాలంటె ఒకే ఒక మార్గం పోరాట మని

నీ చేతులతో బంధించిన
సంకెళ్ళను తెంచాలని
నీ సంతతి స్వేచ్ఛలోన
ఊపిరి పీల్చాలని
దినమంతా రక్తం ధారపోసి
పరిశ్రమించే దీనుల
ఒకటిగా
సమీకరించటం కోసం తల్లీ
నిర్దయంగా పరాన్న భుక్కుల
హతమార్చటం కోసం తల్లీ!
వర్గ రహిత స్వర్గమును
స్థాపించుట కోసం తల్లీ!
ఇది నాలోపలి కోరిక.

అని తన కోరికను వెల్లడించడంలో కవి వర్గ రహిత సమాజం కోసం పరాన్న భుక్కుల హతమార్చడం కోసం శ్రమ జీవుల పక్షం వహించి వారిని సమీకరించడంలో అతని రాజకీయ నిబద్ధత తెలియుచున్నది. ఇక్కడ వర్గ రహిత సమాజానికై ఏపార్టీ పోరాటం సాగిస్తుందో ఆపార్టీకి నిబద్ధమై పోరాటాన్ని సమర్థించటమే రాజకీయ నిబద్ధత. పై వాక్యంలో కవికిగల ఈ నిబద్ధత స్పష్టంగా తెలుస్తుంది. అంతేకాదు తాను స్వయంగా హతమార్చుతాను అనడంలో అతని నిమగ్నతా తెలియుచున్నది. నిమగ్నత అంటే కవి తాను స్పష్టంగా పోరాటంలో పాల్గొనుట. అందుకే 'రాజకీయ సిద్ధాంత నిబద్ధత, నిమగ్నత ఈ సామ్యవాద వాస్తవికతకు జవం జీవం అంటాడు త్రిపురనేని మధుసూదన్ రావు.

'బంధితులంతా ఒకటై
యోధులుగా నిలచినారు
మోసపుటుచ్చుల కుట్రలు
మన గొంతుల బంధించవు
మన చేతుల బంధించిన గొలుసులు
మంచు బిందువులై నేలపడును
గాఢ నిద్రలో కురికిన సింహాలన్ని
నేటికిజూలు దులిపి మేల్కొంటాయి.'

ఒక సిద్ధాంతాన్ని గాని. పోరాటాన్ని గాని కేవలం సిద్ధాంతంగా, పోరాటంగా కాకుండా కాల్పనికాంశాన్ని జోడించి మంచి పద చిత్రాలతో చెప్పినప్పుడు అది పాఠకులుగాని, నిరంతరం పోరాడే శ్రామికులు గాని హృదయాలలో ముద్రించుకొని నూతనఉత్తేజాన్ని పొందుతారు.

పై వాక్యాలలో సంకెళ్ళు మంచు బిందువులై పడిపోవడం, జూలు దులిపి సింహాలు మేల్కొనడం పైకాల్పనికాంశాన్నే తెలుపుతుంది. ఈ కాల్పనికాంశం సాయుధ పోరాటాన్ని సమర్థించే సామ్యవాదవాస్తవికతలో భాగమే.

శ్రామికులు ప్రత్యక్షంగా విప్లవస్పృహతో ఒక చారిత్రిక స్థితిని సృష్టించడంలో పోరాటపు దశలో గాని నిర్మాణ దశలో గాని నిబద్ధమై ఉండటాన్ని వివరించేది సామ్యవాద వాస్తవికత' అన్న త్రిపురనేని వాక్యాలు కూడ సామ్యవాదవాస్తవికతలో మరోఅంశాన్ని తెలియజేస్తాయి. ఈ అంశాన్ని ఈ క్రింది వాక్యాలలో గమనించవచ్చు.

'తిరుగుబాటు బావుటాలు
జగమంతా నిండినాయి
శతసహస్ర కంఠాలు
ప్రతిచోటా కలిసినాయి.

కవి ఇక్కడ పోరాట – దశలో శ్రమజీవుల ఐక్యాన్ని చెప్పుచున్నాడు. చెప్పటమేకాదు తాను స్వయంగా బలపరుస్తున్నాడు.

ఆధునికాంధ్ర కవితామార్గంలో సోషలిస్టు వాస్తవికతను ప్రతిబింబించిన కావ్యం వజ్రాయుధం ఒక మైలురాయి వంటిది.

——...——

# దేశీయ రచనలో నన్నెచోడుని ఆశయము

— శ్రీ ఎ. కృష్ణప్ప, ఎం. ఏ., బి. ఎస్‌సి.

కవిరాజ శిఖామణి బిరుదాంకితుడు నన్నెచోడుడు. ఈతని కావ్యము 'కుమార సంభవము' ఇతని కాల నిర్ణయ విషయములో భిన్నాభిప్రాయములు కలవు. నన్నెచోడుడు నన్నయకు పూర్వుడని కొందరు, నన్నయ తిక్కనల నడిమికాలమువాడని కొందరు, తిక్కన తర్వాతి వాడని మరికొందరు చెప్పుచున్నారు. నన్నయకు తర్వాతి వాడని చెప్పుటయే సమంజసముగానున్నది. ఆంధ్రవాఙ్మయములో షష్ఠ్యంతములు, సప్తసంతానములు, అష్టాదశ వర్ణనలు, సుకవిస్తుతి, కుకవినింద చిత్రబంధ కవిత్వములు మొదలైన వానితో స్వతంత్ర ప్రబంధమును మొట్టమొదట రచించినవాడు నన్నెచోడుడు. మార్గ, దేశి, జాను తెనుగు, వస్తుకవిత మొదలగు పద ప్రయోగములు తెనుగు భాషలో మొదట ప్రవేశపెట్టిన ఘనత కూడ నన్నెచోడ మహాకవికే దక్కినది.

నన్నెచోడుడు తనకావ్యమగు 'కుమార సంభవము' నందు మార్గదేశి పద్ధతులలో దేశికి ప్రాధాన్యము నిచ్చినది విపులీకరించడమే యీ వ్యాస ముఖ్యోద్దేశము.

నృపధూర్జటి భీమయ పండను :

'తల(ం)పు సదర్థ భావమున(ం)
దద్గత సూక్తుల(ం) గూడ వర్ణనల్
గొలుసుగొనంగ గ్రావడులు
గోరిన భంగిక వచ్చుముట్ట(ం) గో
మల గతి దేశిమార్గములు
మట్టుపడం గ్గటనంబులొప్ప నా
ద్యుల క్రియ(ం) జెప్ప నేర్చె నృప
ధూర్జటి భీమయ పండ(ం) డిమ్మహిన్'

అని మార్గదేశి లను గూర్చి వివరించెను. భావ, సూక్తి, వర్ణ, వళులతో దేశి మార్గములు పొందునట్లు జెప్పనేర్తు ననెను.

నన్నెచోడుడు పీఠికలో పేర్కొన్న

'మృదురీతి సూక్తులింపొంద మేలిల్లు గా
భావమ్ము నెలమి ప్రీత్యావహముగ
మెఱుగుల గన్నులు మిఱుమిట్లు వోవంగ
గాంత సుధాసూతి కాంతి జెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తి రాలువాఱ,
దేశిమార్గమ్ములు దేశీయములుగా న
లంకారములఁ దానలంకరింప,
నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు మెచ్చ నమూన నిధులు నిలుప
వలవదే సమస్త వస్తు కవీశ్వర
నూత్న రుచిర కావ్యరత్న వీథి'

పద్యములో పండనివలె భావార్థవర్ణన సూక్తులను దేశిమార్గములుగా పేర్కొని దేశీయములుగా నలంకారములతో నలంకరింపబడిన వస్తుకావ్య మని తెలియపర్చినాడు. మృదురీతి సూక్తులు, మేలిల్లు భావము, మిఱుమిట్లు మెఱుగులు, సుధాసూతి కాంతి, వర్ణనకెక్కు వర్ణనలు తళుకొత్తిరాలు రసములు, దేశిమార్గము అని తెల్పినాడు 'దేశీయములుగా నలంకారములు దాలంకరింప' అని చెప్పుటతో నన్నెచోడుడు దేశీయ కవిత్వము మీద నున్న మమకారము తెలియపర్చెను.

మరల నన్నెచోడుడు .

'చతురోక్తుల నుతపద బహు
గతుల నలంకార భావకాంతి రసార్థో
న్నతిఁ గృతి నతిరసికులు వర
నతిగతి నెఱిగింపవలదె సౌభాగ్యమునన్'

అని సంక్షిప్తముగ పునరుక్తి చేసెను. ఇచట అలంకార, భావ, కాంతి, రసములను చతురోక్తులతో, నుతపదములతో, బహుగతుల వర్ణించినట్లు తెల్పెను. నన్నెచోడుడు దేశీయములగు అలంకారములకు ప్రథమ స్థానమిచ్చి, దేశిమార్గములకు ద్వితీయ స్థాన మిచ్చినట్లు ఊహింపవచ్చును

అదియును గాక నన్నెచోడుడు కుకవి నిందలో

'మార్గకు మార్గము దేశి య
మార్గము వదలంగ దమకు మదివదలక దు
ర్మార్గపద వర్తులన దగు
మార్గవులందలగు నలతి నూహింసుకవులకున్'

అని మార్గకవిత్వమును పూర్తిగా నిరసించినట్లు తెలియును. ఈతనికి దేశిమీద నున్న మమకారము క్రింది పద్యము వలన వ్యక్తమగును.

'మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశికవిత బుట్టించి తెనుం
గున నిల్పి రంధ్ర విషయం
బున జన చాళుక్యరాజు మొదలగు
పలువుర్'

నన్నెచోడుడు మార్గకవులను సుకవులను 'ఉత్తమ సత్కవీశ్వరులను దేశి సత్కవుల సంస్తుతి చేసి' తన ప్రత్యేకతను నిలబెట్టుకొన్నాడు.

విమర్శకులిచ్చిన మార్గదేశి నిర్వచనములు పరిశీలించదగినవి. 'మార్గకవితయన సంస్కృతమేయని, దేశి యన దేశభాష లని శ్రీవేదం వారు వ్రాసిరి. బండారు తమ్మయ్యగారు 'కేవలం గీర్వాణమయిన స్రగ్ధరాదులు కూర్చబడినది మార్గ దేశీయములగు కందము, గీతము మొదలగు మాత్రాగణబద్ధముయినది దేశికవిత' అని చెప్పిరి. శార్ఙ్గదేవాదుల మార్గదేశి విచారమును బట్టి దివాకర్లవా రిచ్చిన దేశిమార్గభేదములవలన సంస్కృతభాష మార్గమని ఆంధ్ర కర్ణాటాది భాషలు దేశి యని తోచును. కోరాడవారు 'మార్గ కవిత సంస్కృత సాహిత్యలక్షణాను సారముగ దేశభాష యందు రచింపబడిన కవితయని, దేశికవిత యనగా దేశీయ చ్ఛందములో రచింపబడినదై దేశీయ సంప్రదాయానుసారమై తత్తద్దేశీయులకు మనోహరంబగు కవిత' అని యనవలెననిరి. కిట్టెలుగారు దేశియన 'language of a country' అని దేశీయ అనగా 'belonging to a country' అని నిర్వచించిరి.

పై విచారమువలన దేశీయచ్ఛందో భాషాసంప్రదాయానుసారముగా తద్దేశీయుల కిష్టమైనదని తేలినది. నన్నెచోడుడు దేశీయచ్ఛందమునకు అధికప్రాధాన్య మిచ్చి, జాను తెనుగులో దేశీయసంప్రదాయము లుండునట్లు రచించెను.

నన్నెచోడుడు దేశీయతకు ప్రాధాన్యము నిచ్చుటకు కారణమేమో విచారింతము. కొందఱు 'గురుభక్తిచే నాతని పేర పత్తసంతాన ప్రతిష్ఠ చేయవలయును భావమే యాతని రచనకు బురికొల్పిన దని' అనిరి. కాని నన్నెచోడుడు జాను తెనుగును, సరళభావమును, వస్తుకావ్యమును జనసామాన్యమునకు సైతము అర్థమగుటకే ఉపయోగించినట్లు పీఠికలో పేర్కొన్న క్రింది పద్యము వలన తెలియును.

'సరళముగాఁగ భావములు
జాను దెనుంగున నింపు పెంపుతో
బిరిగొన, వర్ణనల్ ఫణితి
పేర్కొన, నర్థములొత్తగిల్ల బం
ధురముగ బ్రాణముల్ మధు మృ
దుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తులార్యులకు
గర్ణరసాయనలీల గ్రాలగాన్.'

'జానపదుల్ పురీజను'లని ఎల్లిన గ్రామవాసులను తెల్పెను. జానపద కవితయే కొన్నిమార్పులను బొంది దేశికవితగా బరిణమించునని భావింపవచ్చును. నన్నెచోడుడు గాడు గీతములు, రోకటి పాటలు, అంకమాలికలు మొదలైన దేశి రచనలు వాడినాడు. పాల్కురికి సోమనాథుడు బసవపురాణమున 'సరసమై పరగిన జానుదెనుంగు చర్చింపగా సర్వసామాన్య మగుట' అని పండితారాధ్యచరిత్రయందు సర్వసామాన్యంబు గాను

జానుదెనగు విశేషము ప్రసన్నతకు' అని జాను తెనుగు జనసామాన్యము సులభముగ అర్థము చేసుకొనుటకని వివరించెను. నన్నెచోడుడు కూడ జానుదెనుగున సరళమైన భావములతో దేశీయ రచన సాగించినది సామాన్య జనులకు సైతము సులభముగ అర్థమగుట కని తలంపవచ్చును. జాను తెనుగనగా దేశిపదములు, దేశీయ సంప్రదాయములు బహుళముగా వాడుట యని యాతని యభిప్రాయము కావచ్చును.

నన్నెచోడుడు తన కావ్యములో దేశిపదములకు ప్రాధాన్యమిచ్చిన చోట్లు అనేకములు. ఉదాహరణమునకు

'కాని బాలురైననుదిని పిప్పి యుమిసెడు
చెఱకు విల్లని నమ్మి చేతబట్టి
మెలతల తల వెండ్రుకల కొంది కందెడు
నలరు పుష్పము లమ్ములని తలంచి
తలిరాకులైన గదల్ప నోపని మంద
పవనుండు నొక పెను ప్రాపుగాగ
నబలలు సోపిన నాకాశమునం బాఱు
నళిశుకములు మూలబలము గాగ
నెంత వేసవి ముట్టిన నెండగమరు
నను వసంతుడు దగు సహాయకుడుగాగ
గాకి పిల్లల కోడు పికములు బోటు
మగలుగా నుగ్రుపైంబోవ దగునె మదన'

దేశీయాచార మగు బొమ్మల పెండ్లిని గూర్చిన పద్యము నన్నెచోడుని దేశీయతకు తలమానికము

'తరుణులు చిక్కబొమ్మలును
దంతపుబొమ్మలు మేలిగాజులు
న్నరులును ప్రమానిచొప్పికలు
నల్లడ నోలిన పేర్చి లీల జే
కురబొమరిండ్లం జేయనగు
గూళ్ళను వండుచు బొమ్మపెండ్లి మా
సరముగం జేసి యాడ నగ
జాతి శివార్చన సేయు నయ్యెడన్'

నన్నెచోడునికి అలంకారము లన్నట యన్న అమితప్రేమ. అందుకే నేమొ 'దేశీయములుగా నలంకారములు దా నలంకరింప' అని తన అభీష్టమును తెల్పెను. నన్నెచోడుడు తన కావ్యమున శబ్దాలంకారములు మిక్కుటముగా వాడెను. ముఖ్యముగ నీతనికి శబ్దాలంకారము లన్న చాల ప్రీతి.

'గోపాలక వినుమిప్పుడు
గోపాలకు లాదిగాగ గుత్సితమతులై
గోపాలకు లెల్లను జెడి
గోపాలకులైరి దారకున కతి భీతిన్,'

ఇటువంటి పద్యములు చాల గలవు. నన్నెచోడుడు ఒక పద్యములో నే ఉపమ, అర్థాంతరన్యాస, స్వభావోక్తి అలంకారములు పొందునట్లు రచించిన మేటి

'ఉరుతరాబ్ధికు డయ్యును నోడిపాటె
వరుణు డులుపచు నుతికెడు వాగువోలె
గలుము లెడరైన నేమియు నిలువవనుట
దగ భయాతురుడై నోర దడియులేక'

నన్నెచోడుడు తన కావ్యమునందు పలుకుబడులను, నానుడులను విరివిగా వాడి యున్నాడు.

ఎలుక 'మీది కోపమున నిల్లేర్చినట్లు'
'చీకులావుకం ద్రొక్కిన యట్లు'
'పాలుగలవారి నెమ్మెయి బాపయగునె'
'పేటకానియిల్లు వెంవక కందలు
సొచ్చినట్లు'
'పేద నిధానము గన్నట్లు'

ఇతని రచన అష్టాదశ వర్ణనలతో, మృదుమధుర సూక్తులతో, నవరసభావ భరితమై, వస్తుప్రధాన ప్రబంధమై యొప్పారుచున్నది. మార్గదేశి కవితలలో దేశికవితకే ప్రాధాన్య మిచ్చి ప్రబంధ కవితను తొలుదొల్త చెప్పి తన కవిత్వ ప్రతిజ్ఞను నిలబెట్టుకొన్న కవీశ్వరుడు నన్నెచోడుడు. కోరాడ వారు చెప్పిన 'నన్నయ పురాణమార్గకవితకు మార్గదర్శకుడైనట్లే నన్నెచోడుడు దేశీయంబగు ప్రబంధ కవితామార్గమునకు మార్గదర్శకుడైనా' డనుట అక్షర సత్యం! * *

## ఆంధ్రపురాణము - రజతోత్సవము

సుమారు 25 సం॥ములకు పూర్వము శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారిచే రచింపబడి సాహిత్యాభిమానుల ప్రశంసలందిన ఆంధ్ర పురాణ కావ్యము రజతోత్సవ సభ 3-8-80 తేదీ ఆదివారం సాయంకాలం శ్రీ దుర్గా కల్యాణ మండపమున జరిగినది

సంస్కృత విద్వత్ప్రముఖులైన శ్రీ జమ్ములమడక మాధవ రామశర్మగారు సభకి అధ్యక్షత వహించిరి. సభ సరిగా నిర్ణీతకాలమున ప్రారంభమగుట విశేషము.

ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ ఎం ఆర్. అప్పారావుగారు సభా ప్రారంభము గావించుచు ఆంధ్ర పురాణ కావ్యమును కర్తను పెక్కువిధముల అభినందించి గ్రంథస్థ విషయములను కొన్నిటిని వివరించిరి. సుమారు సంవత్సరము క్రిందట శ్రీ చిన్మయ బ్రహ్మ మహాకవికి పాదముపట్టి గండపెండేరము తొడిగిన వీరి కవి పక్షపాత మెన్నదగినది

పిమ్మట ఉస్మానియా విశ్వవిద్యాలయమున రీడరు శ్రీ జి వి సుబ్రహ్మణ్యము గారు సుదీర్ఘోపన్యాసము గావించిరి. చరిత్రను గురించి ప్రాచ్యపాశ్చాత్యుల అభిప్రాయములను క్షుణ్ణముగా చర్చించిరి. కావ్యవస్తువును వివరించిరి. ఆంధ్ర పురాణము నిజమైన చరిత్ర లక్షణమును, కావ్య లక్షణమును సంతరించుకొన్న మహాకావ్యమని దానికి సాటి కావ్యము నభూతో నభవిష్యతి అని పునః పునః వక్కాణించిరి. కేవలం సంప్రదాయ బద్ధకావ్య లక్షణ దృష్టితో పరిశీలిస్తే నిలువదని అలా ఆంధ్ర పురాణాన్ని పరిశీలించరాదని ప్రాచీన సంప్రదాయాన్ని విడవకుండా

నవీనతని సంతరించుకున్న మహా కావ్య మని వర్ణించిరి. జ్ఞానపీఠ అవార్డు పొందిన ఏ గ్రంథానికీ తీసిపోదనిరి.

చరిత్ర అంటే సంవత్సరాల అంకెలు కాదన్న శ్రీశ్రీ సుభాషితాన్ని ఉటంకించిరి. ఆయాకాలములలోని జనుల కవుల మనోభావ సాంఘికాచారాల వివరణమే సరియైన చరిత్రయనిరి. సంవత్సరములు లేనిదే ఆయా కాలములెట్లు కలుగునవే సందేహం అక్కరలేదు. అంకెలు చరిత్ర కాదంటే కేవలం అంకెలకు ప్రాధాన్యం లేదని మాత్రము గ్రహింపదగును.

ఆంధ్రపురాణము శివభారతముకోవకు చెందినది అని అదే వేదికపై అభిప్రాయము వ్యక్తపఱుపబడినది. ఒకవంక అనన్య సామాన్యమనుట మహాకవి కాని గడియారం వారి మహాకావ్యముకాని శివభారతమునకు సదృశమనుట విరోధాభాసము.

గ్రంథమునుండి కొన్ని ఘట్టములు లేక పద్యములు చదివి ఈ కావ్యము రసవత్తరము, అనన్య సామాన్యము అనుటకివి ఉదాహరణములు అనివివరించియున్నచో అనర్గళ ధారా ప్రవాహముగా విలసిల్లిన శ్రీ సుబ్రహ్మణ్యము గారి ఉపన్యాసము మరింత శోభావహముగా నుండెడిది.

అనంతరము సహకారశాఖ ఉన్నతోద్యోగి శ్రీ రాపాక ఏకాంబరాచార్యులు గారు, పరిశోధకులు శ్రీ ఆదిభట్ల సూర్యనారాయణగారు, శ్రీ వేదుల శ్రీరామచంద్ర కీర్తి గారు ఆంధ్ర పురాణప్రశంస గావించిరి. ఉన్న స్వల్పకాల పరిమితిలో శ్రీ కీర్తి గారు కావ్యశైలి మున్నగు వానిని ఉదాహరణలతో పేర్కొనిరి.

ఆద్యు లుభయులు ఎంతకాలము తీసికొన్నను అంగీకరించుటే కాక ప్రయాణము చేయు రైలుకూత వినబడేవఱకు ప్రసంగింపవచ్చునని ఔదార్యము చూపిన సభాధ్యక్షులు తరువాతివారికి మూడునిమిషములు ఆరు నిమిషములు అని గడువు ఏర్పఱచిన కట్టుదిట్టము ప్రశంసనీయముగా లేదు. పరిశోధక విద్యార్థి బసవపురాణము - పండితారాధ్యచరిత్రము - ఆంధ్ర పురాణము శబ్దముల సామంజస్యమును తెలుపుట మున్నగు చక్కని విషయములను వివరింప బూనుటను మఱి పది నిమిషములైనను కొనసాగనిచ్చిన బాగుండెడిది.

శ్రీ టి. బుల్లెయ్యగారి యధార్థ కథనము రమ్యమేయయ్యె. 25 సంవత్సరములనుండి ఎప్పుడూ ఆంధ్ర పురాణము పుస్తకమే ఎట్లుండునో చూడలేదు అన్న వాక్యము 25 సంవత్సరము అవిచ్ఛిన్నముగా ఆంధ్రప్రజా హృదయముల జీవించియున్న మహాకావ్యమని శ్రీ సుబ్రహ్మణ్యంగారు కావించిన ప్రశంసకు ఉత్కర్షావహముగా లేదు.

కావ్యమునకు రజతోత్సవమన్నది ఇదే ప్రథమమని సమితివారు భావించిరి. గుడివాడలో ఇంతకుముందు సౌందరనందమునకు రజతోత్సవము జరిగినా ఇట్టిది అరుదని మాత్ర మనుకొనుటలో విప్రతిపత్తి లేదు.

మిత్రులు, అభిమానులు, సాహితీ బంధువులు, శ్రీ శాస్త్రిగారిని యథోచితముగా పూలమాలలు, నూతన వస్త్రములు, పద్యప్రసూనములు మున్నగువానితో సత్కరించిన విధము హృద్యము. వదాన్యశేఖరులు శ్రీ గ్రంథి సుబ్రహ్మణ్యముగారి సన్మాన సారథ్యము ప్రశంసనీయము.

శ్రీ సత్యనారాయణ శాస్త్రి గారు నిరుపద్ద లలితము గా రసవంతముగా కవితా ప్రాగల్భ్యము నెఱపిన దిట్ట మహాకవి అనే విషయంలో — సంప్రదాయబద్ధంగా కవిత్వం రచించే వారిలో శ్రీ శాస్త్రిగారు నిస్సందేహంగా మహాకవి అన్న శ్రీ సోమసుందర్ సందేశంలోని వాక్యం విన్న తర్వాత- ఇక సందేహించవలసిన పని లేదు.

శ్రీ శాస్త్రిగారు తమ గ్రంథమునకు జరిగిన సత్కారమునకు సముచిత సమాధాన మొసగిరి. గ్రంథంలో విశేషం ఉండడం చేతనే ఇందఱి ప్రశంసలకు పాత్రమైనదేమో అనుకొంటున్నాను అనిరి. తిక్కన పై చతురోక్తులతో అధ్యక్షులు మధురముగా గ్రంథ ప్రాశస్త్యము నుగ్గడించిన యనంతరము రాత్రి 10 గంటలకు సభ సమాప్తమైనది.

— ఒక సదస్యుడు.

— ... —

## కాంతి వెల్లువ

శ్రీ కరెవరపు వెంకటరామయ్య, ఎం. ఏ (లిట్)



కాలం కనురెప్పల
నీలినీడల్లో
శతాబ్దాల తరబడి
నిశ్శబ్దపు నిట్టూర్పులు
మౌనంగా రోదిస్తుంటే
చచ్చిన చరిత్ర వీథుల్లో
మానవత్వం
'స్టోన్ ఆఫ్ ఆర్క్' లా
బలి అవుతుంటే
కొడి గట్టిన ఆశాదీపిక
కొన ఊపితో
మూలుగుతుంటే-
ధమన్లలో అంగారం
నరాల్లో నగారాలు
జ్వలన తేజస్సుతో
చైతన్య చేతస్సుతో
పర్జన్యంలా గర్జిస్తే
కార్చిచ్చులా ప్రజ్వరిల్లితే
అంధకారచ్ఛట అంతరిస్తుంది
'కాంతివెల్లువ' ముంచెత్తుతుంది

— 0 —

# రచయితలకు మనవి

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁగాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన కొలఁదిరోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్తపుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతవఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

ఎడిటరు.

అడ్రసు :—
సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.